21 ఉ. ఎడ్డెమనుష్యుఁ డే మెఱుఁగు - నెన్ని దినంబులఁ గూడియుండినన్
దొడ్డగుణాఢ్యునందుఁ గల - తోరపువర్తనలెల్లఁ జొప్పడన్
బుద్ధివివేకిరీతి రుచి - పాకము నాలుక గాంచునట్లు?
తెడ్డది కూరలోఁ గలయఁ - ద్రిప్పుచునుండిన నైన భాస్కరా.

22. ఎప్పుడదృష్టతామహిమ - యించుక పాటిలు నప్పుడింపు సొం
పొప్పుచునుండుఁగాక యది - యుప్పని పిమ్మట రూపుమాయుగా
నిప్పననంటి యున్నయది - నిర్మలి నాగ్నిగుడుప్రకాశముల్
దప్పినవట్టి బొగ్గునకుఁ - [illegible]పెంతయుఁ బట్టు భాస్కరా.

23. ఏగలిచాటువడ్డఁ గలదే - భువిసల్పనకున్ సమగ్రతా
భోగము భాగ్యరేఖగల - పుణ్యునకుం బలె నెట్టివత్వసం
యోగమదేభకుంభయుగ - శోత్థితమాంసము నక్కకూనకే
లాగు ఘటించుఁ? సింహము త - లంచినఁ జేకుఱుగాని భాస్కరా

24. ఏసనవర్ష్ణుఁడుండు పటు - కేగు ననర్ష్ణుఁ డువర్ష్ణుఁడున్న చోఁ
జూడఁగ నొల్లఁ డెట్లన వ - శుద్ధగుణస్థితి నీఁగవ్రాయముం
గూడిన పుంటిపైఁ నిలువఁ - గోరిన యటులు నిల్వ నేర్చునే,
మూడిదఁ జెట్టు సన్నుడుటి - చొక్కపుకస్తురి మీఁద భాస్కరా.

25. వీల సమస్త విద్యల నొ - కించుక భాగ్యము గల్గియుండినన్
జాలు ననేకమార్గముల . సన్మతి కెక్క నదెట్లొ యన్నన్
రాలకు నేక విద్యలం తి - రంబుగ దేవరరూపుచేసినన్;
వ్రాలి నమస్కరించి పాస - వంబులు పెట్టరె మీఁద భాస్కరా.

26. ఒక్కఁడె చాలు నిశ్చల బ - లోన్నతుఁ డెంతటి కార్యమైనఁ దా
జక్కనొనర్చుఁ గౌరవుల - [illegible] పట్టిన క్రీడితోటులం

32. కామితవస్తుసంపదలు - గల్గుశుభంబొరులాసపడ్డచో
నేమియుఁ బెట్టఁజేనిసిరి . యేటికి? నిప్పుల ముస్సఁబోయినన్
బ్రామికపడ్డలోకులకుఁ . బండఁగనేమది యెండిపోవఁగా
నేమిఫలంబు? చేఁదు విడ - దెన్నటికైన ముసిండి భాస్కరా.

33. కారణమైన కర్మములు - కాక దిగంబడ వెన్నిగొందులం
దూరిన నెంతవారలకుఁ - దొల్లి పరీక్షితు శాపభీతుఁడై
వారిధినొప్పు నుప్పరిగె - పైఁ బదిలంబుగ డాఁగియుండినం
గ్రూరభుజంగదంతహతిఁ - గూలఁడె లోకు లెఱుంగ? భాస్కరా.

34. చ. కులమున నక్కడక్కడన - కుంఠిత ధార్మికుఁడొక్కఁడొక్కఁడే
కలిగెనుఁగాక పెందఱుచు - గల్గఁగనేరరు; చెట్టుచెట్టునన్
గలుగఁగ నేర్చునే గొడుగు - కాయలు చూడఁగ నాడనాడ నిం
పలరఁగ నొక్కటొక్కటన - యుంబునఁ జేకురుఁగాక భాస్కరా.

35. ఉ. కూరిమనస్కులౌపతులఁ - గొల్చి భజించిన మంచివారికిన్
వారిగుణంబె పట్టిచెడు - వర్తన వాటిలు; మాధురీజలో
దారలు గౌతమీముఖమ - హానదు లంబుధిఁ గూడినంతనే
ఘోరముఁ జెందవే మొదలి - కట్టడలన్నియుఁ దప్పి భాస్కరా.

36. గిట్టుట కేడఁ గట్టడలి - ఖంచిన నచ్చటఁగాని యొందుచోఁ
బుట్టదుచావు; జానువుల - పుష్కలనూడిచి కాశిఁజావఁగా
గ్గట్టిన కూడ్రికుంభములఁ - గప్పుచు దధివ్యాధి గుట్టమాచునా
పట్టునఁ గొంచుమట్టికడఁ - బ్రాణము తీసెఁగదయ్య భాస్కరా.

37. చ. ఘనబలవర్త్యమొప్పు పడఁ - గలిన వానికి హానిలేనిచోఁ
దనదగు నత్యమే తొలుచుఁ - దన్ను నెట్లన? నీరులావుగాఁ

గనుకసియించినన్ జెరుపు - కట్టకు సత్వము చాలకున్నచో
గనుములు పెట్టిపట్టనగు - గండి తెగంబడకున్నె? భాస్కరా.

38. ఘనుఁడగు నట్టివాఁడు నిజ – కార్యసముద్ధరణార్థమై మహిం
బనివడి యల్పమానవుని – బ్రార్థనచేయుట తప్పుగాదుగా?
యనఘతఁగృష్ణజన్మమున - నావసుదేవుఁడు మీఁదకెత్తుగాఁ
గనుఁగొని గాలిగానికడ - కాళ్లకు మ్రొక్కఁడె నాఁడు భాస్కరా.

39 ఘనుఁడొకవేళఁ గీడ్పడినఁ - గ్రిమ్మఱ నాతని లేమి వాపఁగాఁ
గనుఁగొన నొకసత్ప్రభువు · గాక నరాధము లోపలెందఱుం
బెనుచెలు వొందినట్టి తతిఁ - బెల్లున మేఘుఁడు గాక నీటితోఁ
దనుపఁదుషారముల్ శతశ – తంబులు చాలునటయ్య భాస్కరా

40. ఉ. చంద్రకళావతంసుకృప - చాలిననాఁడు మహాత్ముఁడైనఁదా
పాండ్రవిభూతిఁ బాసియొక - జాతివిహీనుని గొల్చియుంటయో
గీంద్రనుతాంఘ్రిపద్మమతి - హీనత నొందుట గాదుగా హరి
శ్చంద్రుఁడు వీరబాహుని ని – జంబుగఁ గొల్వఁడె నాఁడు భాస్కరా

41. చక్కఁదలంపఁగా విధి వ – శంబున నల్పునిచేతనైనఁదాఁ
జిక్కి యవస్థలం బొరలుఁ - జెప్పఁగరాని మహాబలాఢ్యుఁడున్
మిక్కిలి సత్వసంపదల - మీఱిన గంధగజంబు మావటీఁ
డెక్కియదల్చికొట్టి కుది - యించిన నుండదె యోర్చి భాస్కరా.

42 చ. చదువదియంతగల్గినర - సజ్ఞత యించుక చాలకున్న యా
చదువు నిరర్థకంబు గుణ - సంయుతు లెవ్వరు మెచ్చరెచ్చటం
బదనుగ మంచికూరనల - పాకముచేసిన నైన నందు నిం
పొదవెడు నుప్పులేక రుచి - పుట్టఁగ నేర్చునటయ్య? భాస్కరా.

43 ఉ. చాలఁ బవిత్రవంశమున - సంజనితుండగునేని తొట్టి దు
శ్శీలునినైనఁ దత్కులవి - శేషముచే నొకఁడుర్వినెంతయుం
జాలిమినుద్ధరించును, సు - ధానిధిఁ బుట్టఁగఁగాదె శంభుఁడా
హాలహలానలంబుగళ - మందు ధరించుట పూనిభాస్కరా.

44 ఉ. చేరిబలాధికుండతఁడెఁగి - చెప్పినకార్యము చేయకుండినన్
భారము మోట్టలేఁడొక న - పంబునఁ దాఁ జెడునట్టిధన్యుడున్
బోరక పాండుపుత్రులకు - భూస్థలిభాగము పెట్టనన్న కం
సారిని గాకుచేసిచెడఁ - డాయెన కౌరవభర్త భాస్కరా.

45. చేసిన దుష్టచేష్టనది - చెప్పక నేర్పునఁ గప్పిపుచ్చితా
మూసినయంతటన్ బయలు - ముట్టక యుండదదెట్లు? రాగిపైఁ
బూసిన బంగరుం జెదరి - పోవఁగ గడంగిన నాఁడు నాఁటికిన్
వాసినరాగి గానఁబడ - నాజనులెల్ల నెఱుంగ భాస్కరా.

46. చ, తగిలి మదంబుచే నెదిరిఁ - దన్నెఱుంగక దొడ్డవానితోఁ
బగగొని పోరుటెల్ల నతి - పామరుఁడై చెడుటింతెకాక తా
నగడి జయింపనేరఁడతి. నిక్కము తప్పదు ధాత్రిలోపలన్
డగి యొక కొండతోఁ దగరు - దోకొని తాఁకిననేమి భాస్కరా.

47. తడవఁగరాదు దుష్టగుణుఁ - దత్వమెఱుంగక యెవ్వరైన నా
చెడుగుణమిట్లు వల్వదని - చెప్పిన గ్రక్కునఁ గోపచిత్తుఁడై
కడుఁదెగఁజూచుఁగా, మరుగఁ - గాఁగిన తైలము నీటిబొట్టుపైఁ
బడునెడ నాక్షణంబెగసి - భగ్గున మండకయున్నె? భాస్కరా.

48. తనకు ఫలంబులేదని యె - దాదలపోయఁడు గీర్తిఁ గోరునా
ఘనగుణశాలి లోకహిత - కార్యముమిక్కిలి శ్రద్ధమైఁ జే

లనుకొన్నఁ బ్రాణశేషుఁడు స - హస్రముఖంబుల గాలిఁ గ్రోలి తా
ననిశము మోవఁడే మఱి మ - హాభరమైన ధరిత్రి భాస్కరా.

49. తనకు నదృష్టరేఖ పిశ - దంబుగ గల్గినఁగాని, లేమిచో
జనునకు నెయ్యెడన్ బరుల - సంపదవల్ల ఫలంబు లేదుగా,
కనుఁగవ లెస్సగాఁ దెలివి - గల్గిన వారికిఁగాక గ్రుడ్డికిన్
కనుబడునట్లు వెన్నెలలు - గాయఁగ నందొక రూపు, భాస్కరా.

50 ఉ. తాలిమితోడుతం దగవు - తప్పక నేర్పరి యొప్పు తప్పులం
బాలన సేయఁగాక ట ను - పాయవిహీనుఁడు సేయనేర్చునే?
పాలును నీరు వేఱుపఱు - పంగ మరాళ మెఱుంగుఁగాక మా
ర్జాల మెఱుంగునే తదురు - చారురసజ్ఞతఁ బూన భాస్కరా.

51. తాలిమితోడఁ గూరిమిఁ గృ - తఘ్నునకెయ్యెడ నుత్తమోత్తముల్
మేలొనరించినన్ గుణము - మిక్కిలి కీడగుఁ బాముపిల్లకున్
పాలిడి పెంచిన న్విషము - పాయఁగ నేర్చునె దానికోఱలం
జాలఁగ నంతకంత కొక - చాయను హెచ్చును గాక భాస్కరా.

52 చ. తెలియనికార్యమెల్లఁ గడ - తేర్చుట కొక్క వివేకిఁ జేకొనన్
వలయు నతండైనఁ దిద్దుకొన - వచ్చుఁ బ్రయోజన మాంద్యమేమియుం
గలుగదు; ఫాలమందుఁ దిల - కం బిడునప్పుడు చేత నద్దముం
గలిగినఁ జక్కఁ జేసికొను - గాదె నరుండది చూచి భాస్కరా.

53 ఉ. దక్షుఁడు లేని యింటికిఁ బ - దార్థము వేఱొక చోటనుండి చే
లక్షలు వచ్చుచుండినఁ బ - లాయనమై చనుఁ గల్లకాదు, ప్ర
త్యక్షము గాఁగులుప్ప వట్ట - లన్నియు వచ్చిన నీరు నిల్చునే
యక్షయమైన గండిపడి - నట్టి తటాకములోన భాస్కరా.

చారుఁడు రావణాసురుఁడు - సహ్యము నొందఁడె చేటుకాలముం
జేరువయైననాఁడు నిర - సించి విభీషణు బుద్ధి భాస్కరా.

60 చ. నొగిలినవేళ నెంతటి ఘ - నుండును దన్నొకరొక్కరేర్పుతో
నగపతి ప్రోదిసేయక త - నంతట బత్కఁగ రాఁడు నిక్కమే
జగమున నగ్నియైనఁ గడు - సన్నగిలంబడియున్న నింధనం
బెగయఁగఁ ద్రోచియూఁదకను - తెట్టురవుల్గొననేర్చు భాస్కరా

61 ఉ. పండితులైనవారు దిగు - వం దగనుండఁగ నల్పుఁ డొక్కఁడు
ద్దండతఁ బీఠమెక్కినను బు - ధప్రకరంబుల కేమియొగ్గునే?
కొండొక కోఁతి చెట్టుకొన - కొమ్మలనుండఁగఁ గ్రిందనుండ భే
రుండమదేభసింహనికు - రుంబము లుండవె? చేరి భాస్కరా.

62. పట్టుగ నిక్కుచున్ మనమునం - బట్టిమహాత్ములఁ దూలనాడి సం
బట్టిన కార్యముల్ చెడును - బ్రాణముపోవు? నిరర్థదోషముల్
పుట్టు; మహేశుఁగాదని కు - బుద్ధి నొనర్చిన యజ్ఞతంత్రముల్
ముట్టకపోయె దక్షునికి - మోసమువచ్చెఁగదయ్య భాస్కరా.

63 చ. పరహితమైనకార్య మతి - భారముతోడిదియైనఁ బూను స
త్పురుషుఁడు లోకముల్ పొగడఁ - బూర్వమునందొక కాలవర్షముల్
గురియఁగఁ జొచ్చినన్ గనిసి - గొబ్బున గోజనరక్షణార్థమై
గిరినొక కేల నెత్తెనఁట - కృష్ణుఁడు ఛత్త్రముగాఁగ భాస్కరా.

64 ఉ. పలుచని హీనమానవుఁడు - పాటిదలంపక నిష్ఠురోక్తులం
బలుకుచు నుండుఁగాని మతి - భాసురుఁడైన గుణప్రపూర్ణుఁ డొం
ప్పలుకులఁ బల్కఁబోఁడు, ని - జమ్మిది, [illegible]
[illegible] - [illegible] భాస్కరా

65 చ. పలుమఱుసజ్జనుండుప్రియ - భాషలెపల్కుఁగఠోర వాక్యముల్
పలుకఁడొకానొకప్పుడవి - పల్కినఁ గీడునుగాదు నిక్కమే
చలువకువచ్చిమేఘుఁడొక - చాడఁతడావడగండ్లఁ రాల్చినన్
శిలలగునోటు వేగిరమె - శీతలనీరముగాక, భాస్కరా.

66. ఉ. పాపపుఁ ద్రోవవానికొక - పట్టున మేను వికాశమొందినన్
లోపలదుర్గుణంబె ప్రబ - లుంగద, సన్మఁగఁగూడదాతనిన్
బాపటకాయకున్ నునుపు - పైపయిఁగల్గినఁ గల్గుఁగాక నే
గూర్పున దానిలోఁగలప - రుద్ధపుఁజేఁదునశించు భాస్కరా.

67. పూనినభాగ్యరేఖ చెడి - పోయినపిమ్మట నెట్టిమానవుండై
నను వాని నెవ్వరు ప్రి - యంబునఁ బల్కరు బిల్వరెచ్చటన్
దానదియెట్లొకోయనినఁ - దథ్యము పుష్పమువాడి వాసనా
హీనత నొందియున్నయెడ - నెవ్వరుముట్టుదురయ్య భాస్కరా.

68. పూరితసద్గుణంబుగల - పుణ్యునకించుక రూపసంపదల్
దూరములైనవానియెడ - దొడ్డగఁజూతురు బుద్ధిమంతులె
ట్లారయ గొగ్గులైన మఱి - యందులమాధురిఁజూచికాదెఖ
ర్జూరఫలంబులం బ్రియము - సొప్పడలోకులు గొంటభాస్కరా.

69. ప్రల్లదనంబుచే నెఱుక - పాటొకయింతయులేక, మెచ్చుటన్
బల్లిదుఁడైన సత్ప్రభు న - బద్ధములాడినఁ ద్రుంగిపోదు రె
ట్లల్లనశౌర్యలిం గుమతు - లై శిశుపాలుఁడు దంతవక్త్రుఁడున్
గల్లలుఁ గృష్ణునిం బలికి - కాదెహతంబగుటెల్ల భాస్కరా.

70. ప్రేమనుగూర్చి యల్పునకు - పెద్దతనంబును, దొడ్డవానికిన్
దామతి తుచ్ఛవృత్తంబది న - దంబికింపక యాయతానుగా

పాముకరంబుతోఁ గుడుచు - వాం గుడిచేతన పాసమాగగ ముం
దోముగ వచ్చునే మిగుల - దోచని చేతలుగాక భాస్కరా.

71 ఉ. ఫలమతిసూక్ష్మమైనను నృ - పాలుడు మంచిగుణాఢ్యుడైనచో
నలమిని వేకులాతని క - పేక్షయొనర్తురెట్లు చంద్రికా
విలసనమైనదామసతి - వింపఁ జకోరములాసజేరవె
చలువగలట్టివాఁడగుట - జందురు నెంతయుగోరి భాస్కరా!

72. ఉ. బంధురసద్గుణాఢ్యుఁ డొక - పట్టున లంపట నొందియైన దు
స్సంధి దలంప డన్యులకుఁ - జాలహితంబొనరింతుగాక శ్రీ
గంధపు జెక్క రాగిలుచుఁ - గాదె శరీరులకుత్సవార్థమై
గంధములాత్మ బుట్టఁదరు - గంబడియుండుటలెల్ల భాస్కరా!

73 ఉ. బలముతొలంగు కాలమునఁ - బ్రాభవసంపదలెంత ధన్యుడున్
నిలుపుకొనంగ నోపఁడట - నిశ్చయ మర్జునుఁడీశ్వరాదులం
గెలిచినవాఁడుఁ బోయలకు - గీడ్పడి చూచుచుఁ గృష్ణభార్యలం
బలువుర నీయఁడే నిలువఁ - బట్ట సమర్థుఁడుగాక భాస్కరా.

74. బలయుతుఁడైనవేళ నిజ - బంధుఁడు తోడ్పడుఁగాని యాతఁడే
బలముతొలంగెనేని తన - పాలిటి శత్రువ దెట్లు పూర్ణుఁడై
జ్వలనుఁడు కానగాల్చుతరి - సఖ్యముఁ జూపును వాయుదేవుఁ డా
బలియుఁడు సూక్ష్మదీప మగు - పట్టున నార్పదె గాలి భాస్కరా!

75 ఉ. బల్లిదుఁడైన సత్ప్రభువు - పాయక యుండినఁగాని రచ్చలోఁ
జిల్లరివారు పూనుకురు - చేరినఁ దేమియుగల్గ దయ్యెడన్
జల్లని చందురుం డెడసి - చన్నపుఁ ఖద్యోతకోటియున్న రం
జిల్లునె వెన్నెల్ జగముఁ - జీకటులన్నియుఁ బాయ భాస్కరా.

76 చ. భుజబలశౌర్యవంతులగు - పుత్త్రులఁ గాంచిన వారి కెయ్యెడన్
నిజహృదయేప్సితార్థములు - నిక్కముచేకురుఁ గుంతిదేవికిన్
విజయబలాఢ్యుఁ డర్జునుఁడు - వీరపరాక్రమ మొప్ప దేవతా
గజమును దెచ్చి తల్లివ్రత - కార్యముదీర్పఁడె తొల్లి భాస్కరా
77 ఉ. భూనుతులైన దేవతలు - పూర్వము కొందఱు వావివర్తనల్
మాని చరింపరో యనుచు - మానవు లట్లచరింపఁబోల దం
భోనిధులన్నియుం దనదు - పుక్కిటఁబట్టి నగస్త్యుఁడంచు నా
పూనికఁ జెప్పఁడోవునది - పూర్వమహత్త్వము సుమ్ము భాస్కరా.
78. భూపతికాత్మబుద్ధి మదిఁ - బుట్టనిచోటఁ బ్రధానులెంత ప్ర
జ్ఞాపరిపూర్ణులైనఁ గొన - సాగదు కార్యము కార్యదక్షులై
రూపిత ద్రోణభీష్మకృప - రౌఢు లనేకులుగూడి కౌరవ
క్ష్మాపతి కార్యమేమయినఁ - జాలిరెచేయఁగ వారు భాస్కరా.
79. భూరిబలాఢ్యుఁడైనఁ దల - పోయక విక్రమశక్తిచే నహం
కారమునొందుటల్ తగవు - గాదతఁడొక్కెడ మానపోవుఁగా
వీరవరేణ్యుఁ డర్జునుఁడు - వింటికి నేనధికుండనంచుఁ దా
నూరక వింటి నెక్కిడఁగ - నోపఁడు కృష్ణుఁడులేమి భాస్కరా.
80. భ్రష్టాంగ గర్వవంతులగు - బాంధవు లెందఱుగల్గినన్ నిజా
దృష్టములేదు గావున ద - రిద్రతఁ బాపఁగలేరు సత్కృపా
దృష్టిని విల్పిలోకులకు - సుస్థిరసంపదలిచ్చు లక్ష్మి యా
జ్యేష్టక చేటికిన్ గలుగఁ - జేయదు తోడని పుట్టిభాస్కరా.
81 చ. మదిఁ దను నాసపడ్డ ఘోడశ - మంచిగుణోన్నతుఁ డెట్టిహీనునిన్
వదలఁడు మేలుపట్టునన - వశ్యము మున్నుగ నాదరించుఁగా

త్రిదశవిమానమధ్యమునఁ - దెచ్చికృపామతి సారమేయమున్
మొదల నిడండె ధర్మజుఁడు - మూగిసురావళిచూడభాస్కరా.

82 ఉ. మాటలకోర్వఁజాలఁడభి - మానసమగ్రుఁడుప్రాణహానియౌ
చోటులనైనఁ దానెదురు - చూచుచునుండుఁగొలంకులోపలన్
నీట మునింగి నప్పుడతి - నీచములాడిన రాజరాజు పో
రాటమొనర్చి నేలఁబడ - డాయెనె భీమునిచేత భాస్కరా.

83. మానవనాథుఁడాత్మరిపు - మర్మమెఱింగిన వాని నేలినం
గాని జయింపలేఁడరులఁ - గార్ముకదక్షుఁడు రామభద్రుఁడా
దానవనాయకుంగెలువఁ - డానెటులోపుఁదదీయనాభికా
స్థానసుధన్విభీషణుఁడు - తార్కొని చెప్పకయున్న భాస్కరా.

84. మానవుఁడాత్మకిష్టమగు - మంచిప్రయోజన మాచరించుచోఁ
గానకయల్పుఁడొక్కఁడది - గాదని పల్కిన హానిపల్కులై
మానఁగఁజూడఁడాపని న - మంచితభోజన వేళనీఁగ తా
లూనిన వంటకంబు దిన - కుండఁగ నేర్పగునోటు భాస్కరా.

85. మానిని చెప్పినట్లిరుక - మాలినవాఁడటు చేసినన్ మహా
హానిఘటించునే ఘనుని - కైన నసంశయ మిద్దిపైఁగృపా
హీనతబల్కినన్ దశర - థేశ్వరుఁడంగన మాటకై గుణాం
భోనిధి రాముఁబాసి చని - పోవఁడె శోకముతోడ భాస్కరా.

86 చ. మునుపొనరించు పాతక మ - మోఘము జీవులకెల్లఁబూనియా
వెనుకటిజన్మమందనుభ - వింపక తీఱదు రాఘవుండు వా
లినిబడనేసి తామగుడ - లీలయదూద్భవుఁడై కిరాతుచే
వినిశితబాణపాతమున - వీడ్కొనఁడే తనమేను భాస్కరా.

87. రాకొమరుల్ రసజ్ఞుని ది - రంబుగ నున్న ననుంచినట్లు భూ
లోకమునందు మూఢుఁడమ - లోపల నుంపరు నిక్కమేకదా?
చేకొని ముద్దుఁగా చదువు - చిల్కను బెంతురు గాక పెంతురే
కాకము నెవ్వరైన శుభ - కారణ సన్ముని సేవ్య భాస్కరా.

88. లోకములోన దుర్జనుల - లోఁతు నెఱుంగక చేరరాదు సు
శ్లోకుఁడు చేరినం గవయఁ - జూతురు చేయుదు రెక్కసక్కెముల్
కోకిలఁ గన్నచోటగుమి - గూడి యసహ్యపుఁగూఁతలార్చుచుం
గాకులు తన్నవే తఱిమి - కాయము తల్లడమంద భాస్కరా.

89. లోనదృఢంబుగాని పను - లోభిని నమ్మియసాధ్యకార్యముల్
కానక పూనునే వతఁడు - గ్రక్కునఁ గూలును నోటివుట్టపై
మానవుడెక్కిపోవనొక - మాటుబుటుక్కున ముంపకుండునే
తానొక లోఁతునం గెడసి - దానిఁ దరింపఁగ లేక భాస్కరా.

90. వంచన యింతలేక యెటు - వంటి మహాత్ముల నాశ్రయించినం
గొంచెమెకాని మేలునను - గూడదదృష్టము లేనివారికిన్
సంచితబుద్ధి బ్రహ్మనని - శంబును వీఁపున మోచువట్టి రా
యంచకు దుంపతూండ్లు దిన - నాయెఁగదా ఫలమేమి భాస్కరా.

91. వట్టుచుఁ దండ్రియత్యధమ - వర్తనుఁడైననుగాని వానికిం
బుట్టిన పుత్రకుండు తన - పుణ్యవశంబున దొడ్డధన్యుఁడౌ
నట్టిన మఱ్ఱివిత్తుమును - పెంతయుఁ గొంచెముదాఁ బుట్టు నా
చెట్టుమహోన్నతత్వమును - జెందదె శాఖలనిండి భాస్కరా.

92. చ. వలనుగఁ గావలందుఁ బ్రతి - వర్షమునంబులి నాలుగైదు పి
ల్లలఁగను దూడనొక్కటి ని - లంగను ధేనువు రెండుమూఁడునేఁ

దులకట్టులైన బెబ్బులికి - టుంబము లల్పములాయె నాలమం
దలు గడువృద్ధిఁ జెందవె యు - ధర్మపు ధర్మము దెల్ప భాస్కరా.

93. వలవదు క్రూరసంగతి యు - వశ్యమొకప్పుడు సేయఁబడ్డచోఁ
గొలఁదియెకాక యెక్కువలు - గూడవు తమ్ములపాకులోపలం
గలసిన సున్న మించుకయ - కాక మఱించుక యెక్కువైన నా
నలుగడఁ జీల్చుచుఱుమని - నాలుక పొక్కకయున్నె భాస్కరా.

94. ఉ. వానికి విద్యచేత సిరి - వచ్చెనటంచును విద్య నేరఁగా
బూనినఁ బూనుగాక తన - పుణ్యము చాలక భాగ్యరేఖకుం
బూనఁగ నెవ్వఁడోపు సరి - పోచెవి పెంచునుగాక దృష్టతా
హీనుఁడు కర్ణభూషణము - లెట్లుగణింపఁగనోపు భాస్కరా.

95. సంతతపుణ్యశాలి యొక - జాడను సంపదవాసిపోయి తా
నంతటఁబోక నెట్టుకొని - యున్నటియట్ల నసించియుండు మా
సాంతమునందుఁ జందురుని - నన్నికళల్ పెడఁబాసి పోయినం
గాంతివహింపఁజోటు తిరు - గంబడి దేహమునిండ భాస్కరా.

96. చ. సకలజనప్రియత్వము ని - జంబుగఁ గల్గిన పుణ్యశాలి కొ
క్కొకయెడ నాపదైన దశ - వుండదు వేగమె పాసిపోవుఁగా
యకలుషమూర్తియైనయమృ - తాంశుఁడు రాహువుచే న్నుమ్రింగినం
టకటక మానియుండఁడె ద్వ - థస్థితి నెప్పటి యట్ల భాస్కరా.

97. ఉ. సన్నుతకార్యదక్షుఁడొక - చాయ నిజప్రభ యప్రకాశమై
యున్నపుడైన లోకులకు - నొండొక మేలొనరించు సత్త్వ సం
పన్నుఁడు భీముఁడాద్విజుల - ప్రాణము కావఁడె యేకచక్రమం
దెన్నికగా బకాసురుని - నేపున రూపడగించి భాస్కరా.

98 చ. సరసగుణ ప్రపూర్ణునకు - సన్నపు దుర్గుణ మొక్కవేళయుం
దొరసిన నిట్టిదీకుఁదగ - దోయని చెప్పిన మానునేర్పుగా
బురదయొకింత మేకలఁగ - బొందిన వేళల జిల్లవిత్తుపై
నొరసిన నిర్మలత్వమున - నుండవె నీరములెల్ల భాస్కరా.

99. సరస దయాగుణంబుగల - జాణముహింగమునొచ్చి దయుండియుం
దఱచుగవానికావఁబడి - దాయఁగవత్తురు లోకులెల్లసం
జెఱకురసంబుగానఁగను - జిప్పిలిపోయిన మీఁదఁబిప్పియై
ధరబడియున్నఁ జేరవె ము - దంబునఁజీమలు పెక్కు భాస్కరా.

100 ఉ. సారవివేకవర్తనుల - సన్నుతి కెక్కిన వారిలోపలం
జేరినయంత మూఢులకుఁ జేపడదా నడ యెట్టు లన్నఁగా
సారములోన హంసముల - సంగతి నుండెడి కొంగపిట్ట కే
తీరునఁ గల్గనేర్చును ద - దీయగతుల్ దలపోయ భాస్కరా.

101 ఉ. స్థానముతప్పివచ్చునెడఁ - దానెటువంటి బలాఢ్యుఁడున్ నిజ
స్థానికుఁడైన యల్పుని క - తంబున నైననుమానపోవుఁగా
కాననలోపల న్విడలి - గంధగజంబొకనాఁడు నీటిలోఁ
గానక జొచ్చినన్ మొసలి - కాటుకు లోఁబడదోటు భాస్కరా.

102 చ. సిరిగలవాని కెయ్యెడలఁ - జేసినమేలది నిష్ఫలంబగున్
నెఱిగురిగాదు పేదలకు - నేర్పునఁ జేసిన సత్ఫలంబగున్
వఱపునవచ్చి మేఘుఁడొక - వర్షము వాడినచేల మీఁదటం
గురిసినఁగాక యంబుధులఁ - గుర్వఁగనేమి ఫలంబు భాస్కరా.

103. సిరివలెనేని సింహగుహ - చెంతకుఁబోయినఁ గాలు సింహముల్
కరుల వధింపఁగా నచటఁ - గల్గును దంతచయంబు ముత్యముల్
వారువునక్క జొక్కడ - నాశ్రయమొందిన నేమిగల్గెడుం
గొరిసెలు దూడతోఁకలును - గొమ్ములు నెమ్ములుగాక భాస్కరా

104. స్థిరతరధర్మవర్తనఁ బ్రసిద్ధికి నెక్కిన వానినొక్కఁడు
ష్కరుఁడతినీచవాక్యములఁ గాదని పల్కిన నమ్మహాత్ముఁడుం
గొఱఁతవహింపఁడయ్యెడ న కుంఠిత పూర్ణసుధాపయోధిలో
నరుగుచుఁ గాకి రెట్టయిడి నందున నేమికొఱంత భాస్కరా.

105. స్ఫురతరకీర్తివంతులగుఁ బుత్రులఁ గాంచినఁ గాక మూఢము
ష్కరులఁ గనంగఁ దేజములు గల్గవుగా మణికీలితాంగుళీ
భరణములంగుళంబులకు భస్థితిఁ బెట్టినఁ గాక గాజుటుం
గరములు పెట్టినందున వికాసము గల్గునటయ్య భాస్కరా.

106 ఉ. సేసగ వాంఛితాన్నము భుజింపఁగ లబ్ధము గాక లేనిచో
మేనులుడస్సియుంట నిజమేకద దేహులకగ్నిహోత్రుఁడా
నే నిజభోజ్యముల్ గుడుచు నేనియుఁ బుష్టివహించు లేనినాఁ
డూని విభూతిలోనడఁగి యుండఁడె తేజముతప్పి భాస్కరా.

107. కాలినిజప్రబుద్ధి తిర మైన విధంబునఁ బెట్టుబుద్ధులా
వేళలకంతె కాని చెడి వెన్కకు నిల్వవు హేమకాంతియు
న్నాళులకుండుఁగాని యొక నాఁడు పదంపడి సానఁబట్టినన్
దాళుకయుండునే యినుప తాటకుఁ జాయలు పోక భాస్కరా.

108. హీనకులంబునందు జని యించిన వారికి సద్గుణంబులె
న్నేనియుఁ గల్గియున్న నొక నేరము చెందకపోదు పద్మముల్
భానుని గాంచియుంబురదఁ బుట్టుటవల్ల సుధాకరోదయం
బైన నసహ్యమొందవె ప్రియంబునఁ జూడఁగలేక భాస్కరా.

109. ఇంచుక సేవ్యచాలక వి హీనతఁజెందిన నారవిద్యము
మరిచుబహించె నీరతన మిక్కిలి మొట్లనఁ దోలుబొమ్మలన్
మంచి వివేకి వానికెర మాటున నుండి ప్రశస్తరీతి నా
డించిన యాడవే బొమలు డెందము నింపవె ప్రీతి భాస్కరా.



# భాస్కరశతకము.

## అర్థములు

1. అర్థము — మునిసన్నుత=మునులచే పొగడబడుచున్నట్టియు, మద్గురుమూర్తి=నాకుగురుస్వరూపుడవైనట్టియు, దూరాగమనప్రయాసమునకున్=దూరమునుండి వచ్చుటవలన గలిగిన శ్రమకు, తారుదారె=తమంతటతామె. శ్రీగలభాగ్యశాలిన్=సంపదగలయైశ్వర్యవంతుని, సమస్తవాహినుల్=నదులన్నియు, సాగరున్=సముద్రుని రత్ననిలయుండనికాదె=రత్నములకు స్థానభూతుడని యేకదా.

తా. నదులు పలుపాట్లుపడియైనను రత్నములకు నిధియనువట్టి యపేక్షతో సముద్రుని జేరుచున్నట్లు జనులు బహుకష్టముల సహించియైన దమంతటతామె ప్రేమగనబరచుచు భాగ్యవంతునింటికి వచ్చుచుందురు.

వ్యు. శ్రీ=ఆశ్రయింపబడినది, సాగరము=సగరపుత్రులచే త్రవ్వబడినది. వాహిని=ప్రవహించునది. నా. శ్రీ=లక్ష్మి, సరస్వతి, కాంతి, కీర్తి.

రూ. తారు=(రూ) తాముతమరు.

2. అ. అంగనన్=ఆడుదానిని, తనయంకకున్=తనస్వాధీనమునకు, మహాబలాఢ్యున్, మహత్=గొప్పదియగు, బల=బలముతో, ఆఢ్యున్=కూడుకొనినవానిని, ఒడ్డి=కల్పించి, తలపెట్టున్=ఆలోచించును, తొల్లి=పూర్వమందు, రానికుయుక్తులు=పిలుపడని చెడుయుక్తులను, పన్ని=కల్పించి, కరంబులు=హస్తములు.

తా. చిత్రాంగి బుద్ధిమంతుడగు సారంగధరునిపై లేనిపోని మాయలుపన్ని యాతని కాలుసేతుల నఱికించి నట్లు స్త్రీలుతమకు లోబడనంత బలముగల వానినైన

ను బలుమాఱులుపన్ని చంపజూతురు కనుక శత్రుని నమ్మగూడదు.

వ్యు. చిత్రాంగి=చిత్రములయిన అవయవములు కలది. భాస్కరుడు=ప్రకాశించువాడు. రూ. పదము. పాదము, పదమ్ము.

వ్యా. లింగబోధకములగు. డు. వు. ము. వర్ణకములు ఏకవచనమునందే వచ్చును. వీనిలో ము వర్ణమునకు మ్ము ముడిగాని పూర్ణబిందు పూర్వక బు వర్ణకముగాని వికల్పము గావచ్చును. పదము, పదమ్ము, పదంబు. కరము. కరమ్ము. కరంబు. చేసెన్ చేయు ధాతువు. భూతార్థకము, ప్రథమపురుషము, ఏకవచనము.

3. అక్కరపాటు=అవసరము, వచ్చుసమయంబునన్=కలిగినప్పుడు, మక్కువన్=ప్రేమతో, ఉద్ధరించుటలు=పోషించుటలు, మైత్రికిన్=స్నేహమునకు, తక్కక=విడిచిపోక, వచ్చుచుండుట=తెచ్చుట, నిదానము=పరీక్షయు, కాదు+ఏ=కాదా అగునని భావము.

తా॥ అవసరము వచ్చినపుడు బంధువు లొకరికొకరు సాయపడుచుండుట మైత్రికి తగినదియేసుమీ? నీటిలో నొకప్పుడు పడవలమీద బండ్లును బండ్లమీద పడవలును వచ్చుచుండుట దీనికి దృష్టాంతముకదా.

వ్యు. మైత్రి=మిత్రునిధర్మము॥ నా. వా॥ మక్కువ=ప్రేమ। కోరిక, నిదానము=ఆదికారణము, యోచన, రోగనిర్ణయము, తలంపన్, తుమున్నర్థకము-దుగ్రాంతము-ధాతువునకు దు తసహిత అవర్ణముచేర్చుట వలనతుమున్నర్థకముపుట్టును.

4. యాచకుల=బిచ్చగాండ్రయొక్క, ఆశలు=కోరికలు, లోభవర్తియై=పిసినితనమునకు నధీనుడై, గడపినన్=జరపినచో, ఈదు=(సంపదల) ఈయదు, లేగలన్=పసిదూడలను, కుడువగనీనిచోన్=కుడుచుకోనీయని పక్షమందు, కెంటి=తూలిపడి.

తా॥ మానవులు పేరాసచే దూడల కీయకుండ గానావుల పాలన్నియు దామే పొందవలెనన్న దురభిప్రాయముతో నుండగా నావులట్టివారికి బాలీయ్యవు, అట్లేమానవుడు పేరాసగలవాడై తన్ను యాచించినవారియొక్క కోర్కెలదీర్పకుండ దగిలిజేసినచో ధర్మదేవతయా లోభికిగూడ నిచ్చుటమానివేయుచుండును.

సమా-అడిగిన యట్టి యాచకులు క. ధా. యాచకుల+ఆశలు, ష. త, లోభవర్తి, తృ. స. ధర్మ+దేవత, సంభావనాపూర్వ పద క. ధా.

ప్రి, ఆశ, ని. అస, వృ్ఙి. అంతటను వ్యాపించునది.

నానా—పాలు 1 భాగము 2 వంతు 3 తీరము 4 అధీనము.

వ్యా— ఈనిచో, నూ-ఇచ్చునకు సర్వంబునకియగు

5. అతి=మిక్కిలి, గుణ=సద్గుణములచే, హీన=హీనుడైన, లోభికిన్=పిసినివానికి, పదార్థము=ద్రవ్యము, కల్మి=భాగ్యము, ఇంపుగాన్=చక్కగా, సతమని శాశ్వతమని, తనకట్టడన్=తనయేర్పాటును, మీఅక=అతిక్రమింపక, రొందున్=రొచ్చోటనైనను, కతుకగన్=నాలుకతోక తుకటకు.

తా॥ శుక్కతవస్వభావమును విడువకనదులు నిండినప్రవాహములతో ప్రవహించుచున్నను నానదులయందు నీరుమిక్కిలి తక్కువగానున్నను నాలుకతో గతుకుచుండుమగాని చక్కగా త్రాగజాలదు, అట్లేలోభియైనవాడు తనకుసంపదలున్నను లేకపోయినను మితముగానె యనుభవించునుగాని సంపదలున్నప్పుడైన బాగుగ ననుభవింపజాలడు.

వ్యు. దేహము=దహింపబడునది, నానా.గుణము=ఐశ్వర్యము, త్యాగము, శౌర్యము, సంధి, ఇంద్రియము పదార్థము=శబ్దములయొక్క అభిధేయము, వస్తువు; పదార్థములు 7 విధములు, ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము.

వ్యా॥ పదార్థము=విశేష్యము-అమహత్తు-కలుగు ధా, క్ర, కలిమి.

6. అదన=సమయము, కూర్చి=ప్రియముగలుగజేసి, అతరము=ప్రేమ, విభుండు=ప్రభువు, గతికి=దాపునకుచ్చి, మొదటికి మోసము=అసలే చెడిపోవును. పశుబృందమున్=పశువులయొక్క సమూహమును.

తా॥ మానవుడు పశువులను చేత్తో పిదికినచో పాలువచ్చును గాని యాపాడుగు గత్తితో గోసినచో పాలనుపొందలేదు మొదటికి చెడుగుగల్గును. అట్లేరాజు మంచిమాటలచే నడిగినచో బ్రజలు ద్రవ్యమునిచ్చుచుందురు కానిబలాత్కారము చేసితెండని నొకమియు నీయకుండగ వారువిడిచి పోవుదురు.

నా. కూర్చి=ద్వితీయావిభక్తి ప్రత్యయము. ప్రజ=సంతతి, విభుడు=బ్రహ్మశివుడు-సర్వవ్యాపకుడు. రూ. అదను-వాదను, ఎవ్వారికి-ఎవ్వరికి-ఏరికి, తలంచి-తలచి,

కూర్చి-కూరిచి. వ్యా. పాదుగుమూలము. మిశ్రము.

7. అనఘునిన్=తగనిమనుష్యుని, చరించునంతలో=సంచరించునప్పుడు, ఎరియంగన్=పరితపించునట్లు, అవమానము=మర్యాదచేయక పోవడము, అనఘునికైనను=పాపరహితునకైనను, చేకుఱున్=వచ్చును, ఏయనువునసైనన్=యేవుపాయము చేతనైనను, అలయింపదె=బాధింపదా.

తా॥ ఇనుముతో గూడవసించుచుండుటచేత నగ్నిహోత్రునకుగూడ సమ్మెటపోటువలన బాధ కలుగుచున్నట్లుభూమియందు దుర్జనునితో గూడిన మంచివానికి సయితము అవమానము కీడుసంభవించుచుండును. ఏయుపాయముచేతనైనను దప్పదు.

వ్యు. ధరిత్రి=సర్వమునుధరించునది. అగ్ని=పైకిపోవునది. నా. నా. ఎరియు=కాలు, అనువు=అనుకూలము, అగ్ని=చిత్రమూలము రూ. ధరిత్రీ-దరిత్రి-ధరా. ప్రవి. అగ్ని (చెవి) అగ్గి. వ్యా॥ తాను-సర్వనామముల పునరుక్తి వారించుటకై ఉపయోగించునది. దీనికిబహువచనము. తమ్ము-తమకు-తారు-తప్పవు-క్రియ-తప్పదా-వ్యతి ప్ర॥బ॥

8. అలఘు=గొప్పవియగు, గుణ=గుణములచేత, ప్రసిద్ధుడు=ప్రఖ్యాతిచెందినవాడు, సుమంతు=గొప్పవాడు, వలచి=కోరి, ఒకించుక=కొలది, ఒక్క కొణిదెండు=ఒకచేరెడు, మహాఫలదుడు, మహత్=గొప్పదియగు, ఫలదుడు=ఫలమునిచ్చునట్టి కృష్ణుడు, భాగ్యములు=ఐశ్వర్యములు. ఈడె=ఈయడా.

తా॥ కుచేలుడు భక్తితో జేరెడటుకులు కొనిపోయికృష్ణునికీయగా నతండతనికిమిగుల గొప్పయైశ్వర్యమునిచ్చెను అట్లేగుణవంతుడు తనకిష్టుడైయుండి తాన తనికింకొంచమిచ్చినప్పటికి నతడు కొంచెమిచ్చిన వానికేయధికఫలము నిచ్చును.

వ్యు. కుచేలుడు=చినిగినవస్త్రములుగలవాడు కృష్ణుడు=కృష్ణ వర్ణముగలవాడు. నా. నా. భాగ్యము=అదృష్టము. సుకృతము. రూ. కొణిదిలి-కొణిదిరి, వి. భాగ్యము. దరిద్రము, కీడు, మేలు.

వ్యా. మహాఫలదుడు. కర్మధారయసమాసము. సంఖ్యాపూర్వము గాని-విశేషణ విశేష్యముల సమాసము. కర్మధారయ నాబరగు. తెలిసి-తెలియు-ధా. క్త్వా. కళ. ధాతువునకు ఇకారము చేర్చుటవలన క్త్వార్థకము పుట్టును.

9. అవని విభుండు, అవని=భూమికి, విభుండు=భర్తయగురాజు, నేరుపరి

యై = తెలివిగలవాఁడై, చరించినన్ = ప్రవర్తించినయెడల, కొల్చువారలు = సేవించువారలు, అవగుణులు = దుర్బుద్ధిగలవారు, చేకుఱున్ = నెరవేఱును, ప్రవిమలనీతిశాలి ప్రవిమల = మిక్కిలి నిర్మలమయిన, నీతి = రాజనీతిచే, శాలి = కూడుకొనినవాఁడు, మర్కటంబులే = కోఁతులే, తవిలి = ప్రయత్నము చేసి, జలధిన్ = సముద్రమును, సుర = దేవతలకు, అరులన్ = శత్రువులయిన రాక్షసులను, తుంచి = చంపి, ఒనర్పవే = చేయలేదా

తా॥ రాజనీతియందు నేర్పుగల రాముడు సముద్రలంఘనము, రక్కసుల నురుమాడుట మొదలగు కార్యముల నీచములగు కోఁతులచేతనే చేయించుకొనినట్లు నేర్పరియగు రాజు అల్పులగు సేవకులచేతనే గొప్పకార్యములు జేయించుకొనగలడు

వ్యు. అవని = రాజులచేరక్షింపబడునది. రాముడు = యోగీశ్వరుల హృదయములో రమించువాడు, మర్కటము = ఇనుకకొమ్మలలోవచ్చునది. నానా. మర్కటము = సాలెపురుగు. రూ. నేరుపరి — నేర్పరి.

వ్యా. విభుండు — ఇకారాంతవ్యతిరిక్తములగు మహద్వాచకములకు బిందుపూర్వక డువర్ణకము వచ్చును. సురారులు వష్టి. తత్పురుషము.

10. ఉదరము = పేరిమి, ఆత్మబలోన్నతిన్, ఆత్మ = తనయొక్క, బల = బలముయొక్క, ఉన్నతిన్ = అధికముచేత, మూలము = కారణము, హిరణ్యపూర్వకశిపన్ = హిరణ్యశబ్దము పూర్వమందుగల కశిపుశబ్దవాచ్యుడను, దనుజుండు = రాక్షసుడు, ఎగ్గు = కీడు, క్షయితంబును = నాశనమును,

తా॥ పూర్వము దురాత్ముఁడగు హిరణ్యకశిపుడు కోపముతో గుణనిధియగు ప్రహ్లాదునకు నపకారముచేసి మృతిపొందెను. అట్లేలోకమున మనుష్యుడు కొంచెమైన నేమలేకుండ బలహీనుడగు మంచివానిని బాధించినచో నప్పుకవచ్చును.

వ్యు. నరుడు — అగ్నియందు తనవశము చేయుకొనువాడు. నానా. ఆత్మ. మనస్సు, బుద్ధి, జీవుడు. మూలము — మల్లంగిచెట్టు, వేరు. రూ. మూలము — మూలకము, నేరిమి — పేర్మి.

11. అరయుచున్ = విచారించగా, చరియించినన్ = సంచరించినను; వానిబాహువన్ = ఆకనియొక్క, శతకారము = సంతత్యాచము; వెలిగారము = వెలిగారమను పేరయొక్కయు

లిమిన్=ఓర్పుతో.

తా॥ పెరుగు మానవులు తన్ను గవ్వముచేగొని మధించుచున్నను వారి కపకారము చేయక తనయందున్న వెన్నను ప్రోవుచేసి తన్ను మథించు వారలకు నిచ్చుచున్నది అట్లే మంచిగుణములు కలవాడు తనకితరులు హానిచేయుచున్నను దానువారికి మేలే చేయునుగాని యపాయము చేయడు.

నానా. పరులు=శత్రువులు. రూ. ఒరులు—ఒర్లు. వ్యా. ఉరుగుణవంతుడు=బహువ్రీహిసమాసము. అన్యపదార్థము ప్రధానము గాగలది బహువ్రీహిసమాసము. ఎటు గడు ఎటుగు ధా॥ క్రియ, వ్యా. ప్ర. ఏ. కర్తృపదము, ఉరుగుణుండు,

16. ఉర=గొప్పనైనను; బల=బలముతో; కాలికన్=కూడినవాడను; అంచున్=అని ఒల్ల=ఇష్టపడని; అన్యమున్; అన్య=ఇతరునియొక్క పతివ్రతాంగనా=పతివ్రతాస్త్రీయొక్క; సురతమున్=సంభోగమును; భూతికిన్=ఐశ్వర్యములకు; కడసుమ్ము=చివరసుమీ; కూలన్=తెగిపడగా; దశకంఠుడు=రావణాసురుడు; అసపడి=కోరి; భృత్యులన్=సేవకులను; తుంగిపోవడె=చచ్చిపోలేదా,

తా॥ రావణుడు తావరముచే గ్రిందుమీదుచూడక సీతను కామించి హితులతోను, సేవకులతోను రణరంగమున జచ్చెను కావున మానవుడు నేనుబలశాలినని గర్వించి తన్ను వలవని కాంతపొందకోరినచో దనయైశ్వర్యము ప్రాణములు పోవును,

వ్యు. పతివ్రతా=పతియందునియమముగలది; దశకంఠుడు=పదికంఠములు గలవాడు; భూతి=విశేషముకలుగునది. నానా. భూతి=భస్మ; ఏనుగు శృంగారము రూ. శిరస్సు—శిరము. వ్యా. సాంతకములకు వాలంతశబ్దములకు వాలు వైకల్పికముగా లోపించి రెండురూపము లేర్పడును. శిరస్సు—శిరము; దశకంఠుడు. బహువ్రీహిసమాసము. నీతి. తనమదముచేత పతివ్రతను అభిలషింపగూడదు.

17. పాటు=ప్రయాసము, పడకుండినన్=పడకపోయినను, ఏపారగన్=అతిశయించునట్లు, ప్రయాసమున్=కష్టమును, ఒందిన=పొందినట్లు, దేవదానవుల్=దేవతలు రాక్షసులు, శౌరికిన్=కృష్ణునికి, శృంగారపుబ్రోవు=అందముల, కుప్పయగు కౌస్తుభరత్నము=కౌస్తుభమణి

తా॥ రాత్రిందివములు కష్టములొందెను సురాసురులందఱు వారికి గాకసము

ద్రములో నుద్భవించిన లక్ష్మియును కౌస్తుభమాణిక్యమును, శ్రీఘుపడకుండ తన్నిచ్చిన విష్ణువునకు సంప్రాప్తమైనవి. అట్లే గొప్పయదృష్టము కలవానికి ప్రయాస మక్కఱలేకయే ఫలము గలుగుచుండును.

వ్యు. దేవతలు - క్రీడించువారు, దానవులు - దనువు అనెడి స్త్రీవలన పుట్టినవారు, శౌరి - శూరవంశమునందు పుట్టినవాఁడు, లక్ష్మి - సర్వమును చూచునది, నా. నా. ఫలము - జాజికాయ, ప్రత్తికాయ, నాగటికఱ్ఱి. వ్యా. దేవదానవుల్ - ద్వంద్వసమాసము.

18. ఊరక=ఏమియుం తెలియక, ఒదిగి=వంగి, దురాత్మకుండు=దుర్జనుడు. ఓర్వలేక=సహింపలేక, నూఱుటంకములు=నూఱేసిటంకములు (టంకమనగా పదియారడజ్జలయెత్తు బంగారునాణెము) చేసెడివి=వెలగలవి, చినిఁగిపో=అచీరలు చినిగిపోవునట్లు.

తా॥ బట్టలు నూఱుటంకములు వెలచేయుచున్నవైనను బొట్టెలో నొదిగియున్నప్పటికిని దనకేమియును ఫలము లేకపోయినను జిమ్మటపురుగా వస్త్రములు ముక్కలుగా గొఱుకుచుండును. అట్లే తనజోలికి రాకుండ మంచివాడొకమూలనుండినను దనకు ఫలము లేకపోయినను నిష్కారణముగ దుర్జనుండా మంచివానికి నపకారము చేయుచుండును.

వ్యు. విద్య = తెలిసికోదగినది. ప్ర. విద్య. + వి. విద్దె. వ్యా. సజ్జనుడు కర్మధారయసమాసము. సాంస్కృతపదముల సమాసము. సాంస్కృతికము. మిశ్రము, ఆచ్ఛికము. అని సమాసములు మూడువిధములు.

19. ఎట్టుగన్=ఏప్రకారమైనను, ప్రాప్తము=పొందతగిన భాగ్యము, పట్టుపడంగనేరదు=సంభవింపదు, నిబద్ధి=నిజము, సురావళిన్; సుర=దేవతలయొక్క, ఆవళిన్=సమూహమును, గట్టు=మందరపర్వతమును, పెకల్చి=పీకి, పాల్కడలిన్=పాలసముద్రమును మథించిరి [illegible]చిరి. వెట్టియొకాళ్ళ=కూలిలేక చేయడమేగాని, ఏమనుభవించిరి=ఏమియనుభవించిరి.

తా॥ రాక్షసులు దేవతలతో సఖ్యముచేసి మందరపర్వతమును బ్రద్దితెచ్చి కవ్వముగాజేసి పాలసముద్రమును కష్టపడి తరిచినను, వారికి సుంతేనియు నమృతము

దక్కినదికాదు కావున లోకములో మానవుడెంత కష్టపడినను దానననుభవింప దగిన యదృష్టము లేక పోయినప్పుడు తానుబడ్డ కష్టమునకు ఫలము చెందలేడు.

వ్యు. అమృతము = దీనిచేత చావదు. నానా: సుర = గాలి, మద్యము, త్రాగు గిన్నె. రూ. ఎట్లు — ఎట్టు. ఆవలి — ఆలి వ్యా. సురావలి షష్ఠీతత్పురుషము. సాంస్కృతికము. నీతి. ఎంతకష్టపడినను ప్రాప్తము లేనిది యేమియు సంభవించదు.

20. ఎడపక = విడలిపెట్టక, దుర్జనుండు = దుర్మార్గుడు, ఒనరించునుగాని = చేయునుగాని, ఒకయించుకయైనను = కొంచెమైనను చీడపుర్వు = చీడపురుగు, పుడిసెండు = చేరెడు; ఇడి = యిచ్చి; పుష్పఫలభూరుహము, పుష్ప = పువ్వులతోను; ఫల॥ పండ్లతోను కూడుకొనిన భూరుహము = చెట్టును.

తా॥ చీడపురుగు బాగుగ వృద్ధిపొందుచున్న పండ్లచెట్లనుముక్కలుగ గొరికి తినుచుండునుగాని చేరెడునీరుపోసి యొకచెట్టునైనను పెంచలేదు. అట్లు దుర్జనుడు పరులకెంతయు కీడుచేయగలడు గాని యొకనికైనను మేలుచేయలేడు.

వ్యు, భూరుహము = భూమియందు మొలచినది. నానా. ఇలము = పురుగులు, ఎఱ్ఱతామర, రూ. భూరుహము — భూవిరుహము. వ్యా. తినున్ — క్రియ తినుధాతు సకర్మకము — తద్ధర్మము. ప్రథమపురుష ఏకవచనము. పుష్పఫలభూరుహము మధ్యమలోపిపద సమాసము. నడిమిపదములోపించునది మధ్యమపదలోపి సమాసము.

21. ఎడ్డ = మూర్ఖుడైన; దొడ్డగొప్పవాడైనట్టి, గుణాఢ్యునందున్ = గుణములతో కూడుకొనినవానియందు; కలతోరపువర్తనలెల్లన్ = కలిగియున్న మంచినడతలన్నిటిని, ప్రజ్ఞన్ = తెలివిచేత, రుచిపాకము = రుచులయొక్క తారతమ్యము; తెడ్డు = గొయ్యగరిటె, కలయన్ = అంతటను, త్రిమ్మరుచుండినన్నైనన్ = తిరుగుచున్నను.

తా॥ బాగుగపండినట్టి కూరలయొక్క చవిని నాలుక తెలుసుకొనును గాని యెల్లప్పుడు కూరలో తిరుగుచున్నను తెడ్డారుచిని తెలుసుకొనలేదు. అట్లే గుణాఢ్యునందుగల మంచివర్తనలు వివేకి తెలుసుకొనును గాని ఆగుణాఢ్యుతో నెంతకాలము సహవాసము చేసినను మూర్ఖుడు తెలుసుకోలేడు.

నానా. దినము = పగలు, పాకము = పంట, పరిపాకము, కావ్యపాకములు మూడు, ద్రాక్షపాకము, కదళీపాకము, నారికేళపాకము. రూ, నాలుక-నాలిక. వ్యా.

గుణాఢ్యుడు - తృతీయాతత్పురుషము.

22. అదృష్ట. తా మహిమన్ = భాగ్యము యొక్క, పెంపు, యింపుగ = పెంచెదము, పాటిలన్ = కలుగునో, ఇంపుసొంపు = చక్కదనము యొక్క యతిశయము, ఒప్పని పి మ్మటన్ = విడిచిపోయినతర్వాత, మాయగా = మాసిపోవునుగదా, అతి...శముల్; అతి = మిక్కిలి; నిర్మలిన = స్వచ్ఛమైన, అగ్ని = అగ్ని హోత్రుని యొక్క; గుడు = గొప్పదియగు, ప్రకాశముల్ = కాంతులు.

తా॥ బాగుగ అగ్ని యొక్క ప్రకాశము గలిగినప్పుడు ప్రకాశించెడు నాయగ్ని కాంతి నశించినతోడనే మిక్కిలి చల్లనిదగుచున్నది. అట్లే యదృష్టమున్నంతకాలము మాగవుడు ప్రకాశించును గాని యది లేనప్పుడు మిగుల మాఱురూపము జెందును.

నా నా. మహిమ = ఐశ్వర్యము; సొంపు = సంతోషము, ప్రసన్నత = సుఖము

రూ॥ మహిమ — మహిమము, పాటిలు — పాటిల్లు. వ్యా. ఇమనిచ్ ప్రత్యయాంత శబ్దములకు ము వర్ణకము వైకల్పికము గావచ్చును. మహిమ — మహిమము. పాటిల్లు కొన్ని తత్సమక్రియల యంతమందు ద్విరుక్త లకారముండును.

23. ఏగతిన్ = ఏరీతిచేత, పాటుపడ్డన్ = కష్టపడుచున్నను. భువిన్ = భూమి యందు, అల్పునకున్ = నీచునకు, సమగ్రితాభోగము = నిండయిన సౌఖ్యము, భూరి...తము, భూరిసత్వ = గొప్ప బలము యొక్క, సంయోగ = కూడికగల; మదేభ = మదపు టేనుగు యొక్క, కుంభయుగళ = కుంభద్వయమునందు, ఉత్ + స్థితమాంసము = పుట్టిన ట్టి మాంసము, చేకుఱగాని = లభించును గాని; లభించుట = సంప్రాప్తమగును.

తా॥ మదపుటేనుగు కుంభస్థలములయందున్న మాంసమున పేక్షించినచో సింహ మునకు లభించును గాని యెంతప్రియాపడినను నక్కపోతునకు లభింపదు. అట్లేనిండ యినసౌఖ్యము భాగ్యవంతునకు లభించును గానియెంతకష్టపడినను నీచునికిలభింప నేరదు.

వ్యు. ఇభము = మదమును పొందునది. నా నా. భోగము = పాముపడగ, పాము యొక్క శరీరము. పాలనము. భోగములు యెనిమిది. గృహ-భోజన శయ్య వస్త్ర-అభ రణ-స్త్రీ పుష్ప-గంధ-తాంబూలములు. మదము = ఏనుగు క్రొవ్వు, గర్వము, సంతోష ము- మదములు యెనిమిది. అన్న-అర్థ-స్త్రీ-విద్యా-కుల-రూప ఉద్యోగ యౌవనములు వ్యా. పాటుపడ్డన్- ద్రుతాంతము, మాంసము, కర్మపదము.

24. అనర్హుఁడు=చెడ్డమనుష్యుఁడు, ఏగున్=పోవును, అర్హుఁడు=మంచివాఁడు ఒల్లఁడు=ఇష్టపడఁడు, అశుద్ధస్థితిన్, అశుద్ధ=పరిశుభ్రము కాని, గుణ=వస్తువులయందు స్థితిన్=ఉండుటచేత, పూయమున్=చీమును, కూడినపుంటపైన్=కూడికొనినకురుపు మీఁద, నూఁడిద=కానుకగ, నిల్వనేర్చునే=నిలువఁగలదా.

తా॥ ఈగ మంచివాసనగల కస్తురియొద్దకుఁ బోక చెడువాసనగల చీముతో నిండియున్న కురుపుమీఁదనే వ్రాలుటకిష్టపడునట్లు అయోగ్యుఁడు మంచివానికడకుఁ బోవ నొల్లక యయోగ్యునొద్దకే పోవుటకు నిష్టపడుచుండును.

వ్యు. రూ. కస్తూరి-కస్తురి- వ్యా. ఎటన్-దృ. అవ్యయము. ఉండున్. క్రియ ఉండుధాతువు.త. ప్ర. ఏ. ఒల్లఁడు దీనికి వ్యతిరేకముం దేకాని భావమందు ప్రయోగము లేదు. వ్యతిరేక-ప్ర. ఏ.

25. ఏల=ఏమిలాభము భాగ్యము=అదృష్టము అనేకమార్గములన్=అనేకపద్ధతులచేత, సన్నుతికిన్=ప్రఖ్యాతికి, అది+ఎట్లు+ఒకో+అనన్=అదియేలాగనఁగా, తిరంబునన్=స్థిరముగా, వ్రాలి=క్రిందపడి, ప్రసవంబులు=పువ్వులు.

తా॥ శాస్త్ర విద్యలనభ్యసింపకపోయినను వానియదృష్టవశమున దేవతారూపమునొంది యందమైనమస్కారములకు పాత్రములగుచున్నవి. కావున మానవులు భాగ్యముండినయెడ ననేకమార్గములచే నుతింపఁబడుదురుగాని కేవలముచదువుకొనుటవలన గాదు.

వ్యు. మార్గము=అడుగులచేత తుడువబడినది. నానా. మార్గము=మృగశిరానక్షత్రము- మార్గశిరమాసము- వ్యా- వ్రాలి-నమస్కరించి. క్త్వార్థకములు- అవ్యయములు- కళలు-ధాతువు తుదను ఇకారముచేర్చుటవలన క్త్వార్థకము పుట్టును.

26. నిశ్చల=చలింపని, బల=బలముచే, ఉన్నతుఁడు=అధికుఁడయినవాఁడు కార్యమైనన్=పనియైనను, ఒనర్చున్=చేసుకొనుచు, ధేనుకోటులన్=ఆవులగుంపులను తత్ప్రబలసేనన్, తత్=ఆకురురాజులయొక్క, ప్రబల=బలముతోఁ గూడిన, సేనన్=సైన్యమును, అనేకశిలీముఖంబులన్=అనేకబాణములచేత, మొక్కపడంగఁజేసి=ఓడించి, ఒక్కకిరీటి=ఒక్క అర్జునుఁడు.

తా॥ కౌరవవీరులు పెక్కుమంది యేకీభవించి విరటుని గోగణములను దోలుకొనిపోవుచుండఁగా నర్జునుఁడొక్కఁడేపోయి వారినోడించి గోవులనన్నిటిని మరలించికొ

37. ఘనబలసత్త్వము; ఘన=గొప్పతియగు; బలసత్త్వము=బలము; అబ్బపడన్=ఏర్పడునట్లు; తనది=తనసంబంధమైన; లావుగాగను=యెక్కువగా; వసియించినన్=ఉన్నప్పుడు; సత్త్వము=బలము; కనుమలు=సందులు; పెట్టు=పడినట్టనడిన్=చెరువుగట్టు నడుమ; గండి=బలము; తెగంబడక=తెగక.

తా॥ చెరువులో నీరధికముగా నున్నప్పుడు చెర్వుగట్టునకు సత్తువలేనిచో నడుమ గండిపడిపోవును. అట్లె తనకధికమగు బలము కలిగినప్పుడు తనకు నితరులవల్లన వాయము కలుగకపోయినను తనబలమె తన్ను బాధుచేయును.

పా నా. కనుమ (దేశ్యము) కొండతోవ; (రూ) నీరు=నీరము; చెరువు=చెర్వు.

38. ఘనుడు=గొప్పవాడు; నిజ...ము; నిజ=తనయొక్క; కార్య=పనియొక్క; సముద్ధరణార్థమై=నిర్వహించుటకొఱకై; మహిన్=భూమియందు, పని పడి=ప్రయత్నముచేసి; అనఘుతిన్=దోషరహితమైన స్వభావముచేత; ఆవసుదేవుడు ఆఆనకదుందుభి, మీదపెత్తుగా=శిరోభూషణముగా, గాలిగాని=గాడిదయొక్క, కడకాళ్లకున్=పాదములకు, నాడు=ద్వాపరయుగమున.

తా॥ కృష్ణుడవతరించిన పిమ్మట నతని గంసునివలన దప్పించుటకై వ్రేపల్లెకుగొనిపోవనెంచి ద్వారపాలురకు తెలియకుండ బోవుచు నకార్యము విఘ్నముకాకుండుటకయి గాడిదకాళ్లకు నమస్కరించెను. అట్లే లోకములో మానవుడు తనకార్యము నెరవేర్చుకొనుటకు నొక నీచుని బ్రార్థించినను నందువలన లోపమురాదు.

నీతి—యెవరైనను వారిపనిని సఫలముచేసుకొను కొరకు నీచులనైనను ఆశ్రయింపవచ్చును. వ్యు. మహి=పూజింపబడునది. కృష్ణు=అన్నిటినిచేయువాడు.

39. ఒకవేళన్=ఒక సమయమందు, కీడ్పడినన్=కష్టమునుపొందినను, వాపగాన్=పోగొట్టుటకు, కనుగొనన్=మామటకును, సత్ప్రభువు=యోగ్యుడగురాజు, నరాధములు=నీచమనుష్యులు, ఒపరు=చాలరు, పెల్లునన్=వేగముగా, తనుపన్=నిండించుటకు తుషారముల్=మంచుతుంపరలు, శతశతంబులు=నూరునూర్లు.

తా॥ పెద్దదొకచెరువు వట్టిపోయినప్పుడు దానిని త్వరలోనే నీటిచే నిండించుటకు మేఘుడు సమర్థుడుకాని మంచుబిందువులెన్నియైన జాలవు. అట్లేగొప్పవానికి విధివశమున బీదతనము సంభవించినచో దానిని దొలగించుటకు నొకమహాప్రభువు సమర్థు

డు కాని నీచమానవు లెందఱయినను సరిపోరు.

వ్యు. మేఘుడు=తనుపువాడు, తుషారము=తాపమును పొందువానిని సంతోషింపచేయునది. నా నా. ప్రభువు=సమర్థుడు. వ్యా. శతశతంబు రెండవశతశబ్దమున కామ్రేడితమని పేరు.

40. యోగీంద్ర=మునీశ్వరులచేత, నుత=స్తోత్రముచేయబడిన, అంఘ్రిపద్మ=పద్మములవంటిపాదములుకల, చంద్ర=చంద్రునియొక్క, కళా=రేఖ, అవతంసు=శిరోభూషణముగాగల ఈశ్వరునియొక్క, కృప=దయ, సాంద్రవిభూతిన్=గొప్పసంపదను, పాసి=వదలిపెట్టి, మతిహీనతన్=బుద్ధితక్కువను, ఒందుట=పొందుట, నాడు=కృతయుగమున, కొల్వడె=సేవించ లేదా.

తా॥ హరిశ్చంద్రుడు చక్రవర్తియైనను దైవకృప లేకపోవుటచే జాతిహీనుడగు వీరబాహుని సేవించెను. కావున నీశ్వరదయ లేనప్పుడు తానెంతగొప్పవాడైనను సంపదలబాసి యొక నీచుని గొల్చియుండుట నిశ్చయము. అట్లు సేవించుట యొక బుద్ధిలోపము గాదు

వ్యు. కళ=లెక్కపెట్టబడునది. విభూతి=విశేషముగా కలుగునది. వ్యా. అంఘ్రిపద్మము=ఉపమానము. ఉత్తరమందుగలది ఉపమానోత్తరకర్మధారయము.

41. చక్కన్=బాగుగా, విధివశంబునన్=దైవవశంబుచేత, చిక్కి=చిక్కుకొనిగానిమహాబలాఢ్యుడున్=వలనుపడని గొప్పబలవంతుడైనను, అవస్థలన్=కష్టములను, పొరలున్=పొందుచుండును, సత్త్వ=బలముయొక్క, సంపదలన్=సమృద్ధులచేత, మీఱిన=అతిశయించిన, మావటీడు=ఏనుగుపై నెక్కువాడు, అదల్చి=కేకలుపెట్టి, కొట్టి కుదియించినన్=కుంగినట్లుచేసినను, ఓర్చు=సహించు.

తా॥ మిగులబలముగల మదపుటేనుగు మావటీడు తనపైనెక్కినను సంకుశముతో బొడిచినను కేకవేసినను గ్రుంగదీసినను వానినన్నింటికి సహించుచున్నది. అట్లెయెంత బలముకలవాడయినను దైవవశమున నల్పునికి జిక్కి చెడువశలం బొందుచుండును.

వ్యు. గజము=మదించునది, గంధము - పరిమళము. ఎక్కి, అదల్చి, కొట్టి. యీమూడున్ను క్త్వార్థకములు. అవ్యయములు, కళలు, యివి భూతకాలమును దెల్పునవి. అల్పునిచేతన్—షోపవిభక్తము, దీని ప్రథమావిభక్తి అల్పునిచేయి. తృతీ

యూసప్తములకు అత్వము ఆదేశమగును.

42. చదువు=విద్య, రసజ్ఞత=రసమునుగుర్తెరుగుట, ఇంచుక=కొంచెము, నిరర్థకంబు=ప్రయోజనములేనిది, గుణసంయుతులు=సద్గుణములతో కూడినవారు, మెచ్చరు=కొనియాడరు, పదనుగన్=పక్వముగా, ఇంపొదవెడు రుచిని కలిగించెడు, పుట్టగనేర్చునటయ్యా=కలుగునటయ్యా.

తా॥ కూరనెంతబాగుగ పాకము చేసినప్పటికి నందులో నుప్పుకలియకపోయిన రుచికలుగదు. ఎవ్వరుబాగున్నదని యనరు. అట్లె మనుష్యుడెంత చదువుకొనినప్పటికి ని రసగ్రాహకత్వము లేనిచో వానిచదువెల్ల నిష్ప్రయోజనము. మఱియు గుణవంతు లెవ్వరును మెచ్చుకొనరు.

నానా. రసము=నీరు, గుణము. విషము. వీర్యము, రూ. ఎవ్వారు, ఎవరు. ఎవ్వారు, ఏరు. వ్యా. నిరర్థకము. నిర్ అను ఉపసర్గన ఞ్ అర్థమును తెలుపును. గుణసంయుతులు. తృతీయాతత్పురుషము, సాంస్కృతికము. మంచికూర—కర్మధారయము ఆచ్ఛికము.

43. చాలన్=మిక్కిలి, పవిత్రవంశమునన్=పరిశుద్ధమైన కులమందు, సంజనితుండు పుట్టినవాడు, దుశ్శీలుండైనన్=దుష్టస్వభావము కలవాడైనను, తత్= ఆ, కుల=వంశమునందలి విశేషముచేత్=అతిశయముచేత తాలిమిన్= శాంతముతో, ఉద్ధరించును=రక్షించును, సుధానిధిన్=పాలసముద్రమందు, అహాలహల=విషమునెడు అనలంబు=అగ్నిహోత్రమును, గళమందు=కంఠమందు, పూని=ప్రయత్నించి.

తా॥ ఈశ్వరుడు హాలాహలాగ్నిమిగుల భయంకరమైనదైనను పాలసముద్రమున బుట్టినదనెడు హేతువుచేతదానిని ఏన గళమందు నిలిపినాడు అట్లె ఎంతవంటి దుశ్శీలుడైనను మంచికులమున బుట్టినచో నాకులమందలి గౌరవముచే వానిని దప్పక యెవ్వడైన బుణ్యాత్ముడు గారవించి పోషించును.

వ్య. వంశము=అడుగబడునది. హాలాహలము=కడుపులో యొక్క పరిపాయము చీల్చునట్లును యింకొకపరియాయము లేనట్లునుండునది. సుధ=సుఖముగా పానము చేయునది. నానా. వంశము—ఎదురు (వి) దుశ్శీలుడు-సుశీలుడు, పుణ్యము-పాపము

44. చేరి=సమీపమునకువచ్చి, బలాఢ్యుండు=మిక్కిలిబలముకలవాడు ఎట్టి

ధన్యుఁడున్ = ఏలాటిసంపన్నుఁడును, పారము = తుదను, ముట్టలేఁడు = పొందఁడు; ఒక నె
పంబునన్ = ఒకదోషముచేత, పోరక = యుద్ధము చేయక, భాగము పెట్టుమా = విభాగించి
ఇమ్ము; అన్నకంసారిని = అనినకృష్ణుని; కాకుచేసి = తిరస్కరించి, చెడఁడాయెనె =
చెడిపోలేదా.

తా॥ శ్రీకృష్ణుఁడు దుర్యోధనుని యొద్దకుఁబోయి పాండవులకు భూమిని పంచి యిమ్మని బోధించిచెప్పఁగా నతని దిరస్కరించి యాతనిమాటలవినక దుర్యోధనుఁడు చెడిపోయెను. అట్లే బలవంతుఁడు తనయొద్దకువచ్చి చెప్పినకార్యము చేయకుండినచో నెంతటివాఁడును తనకార్యము నెఱవేర్చుకొనలేఁడు మఱియును త్వరలోనే నశించును.

వ్యు. పాండు = తెల్లనిది. పుత్రుఁడు = పుత్ అను పేరుగల నరకమునుండి రక్షించువాఁడు. వ్యా. కంసారి షష్ఠీతత్పురుషము- విశేష్యము. చెడున్- క్రియ. చెడుధాతువు త॥ ప్ర-ఏ- ధన్యుఁడు కర్త. నెపము-(దేశ్యము)

45. చేసిన దుష్టచేష్టన్ = చేసిన పాపపుపనిని, నేర్పునన్ = తెలివిచేత, కప్పిపుచ్చి = దాచిపెట్టి, మూసినయంతటన్ = దాచినను, బయలుముట్టక, వెలుపలికిరాక, పూసినబంగరున్ = పూతవేసినబంగారమును, చెదరిపోవ = విడిపోవుటకు, కడంగినన్ = ప్రారంభించఁగా, ఎఱుంగన్ = తెలుసుకొనునట్లు కానబడదా = కనుపించదా.

తా॥ రాగిపై పూసిన బంగారుపూత చెదరిపోయినతోడనే లోపలనున్న రాగి యందఱికి గనపడుచున్నట్లు దుష్టుఁడు చేసిన పాపపుపని నేర్పుచేత దాచిపెట్టినప్పటికి పదియందఱికి దెలియకమానదు.

నానా. బంగరు = సువర్ణము, శ్రేష్ఠము, రాగి = తద్భవమయినయెడ తామ్రము దేశ్యమయినయెడ . తమిదపైరుకు అర్థము. సంస్కృతమయినయెడ అనురాగము గలది యనుపుగలది- రూ. బంగరు, బంగారు, బంగారము.

46. అగిలి = వెంబడించి; మదంబుచేన్ = గర్వముచేత; ఎదిరిన్ = శత్రువును; పెద్దవానితో = గొప్పవానితో; పగగొని = విరోధము పూని; పోరుచెల్లన్ = పోట్లాడుటంతయు: అతిపామరుఁడై = మిగుల మూఢుఁడై; నెగడి = బలవంతుఁడై; ధాత్రిలోపలన్ = భూమిలోపల తగరు = పొట్టేలు; తెగి = సాహసించి; ఢీకొని = యెదుర్కొని.

తా॥ పొట్టేలు సాహసించి యొకకొండ నెదుర్కొని తాకినచో దనతల పగు

లుటతప్ప నేమియులాభముండదు. అట్లే బలహీనుడు కావరముచే దనబలమును శత్రు బలమును బాగుగయోచింపకుండ మహాబలునితో బోట్లాడినచో దాను చెడిపోవుట త ప్పరేమియు ఫలముండదు.

వ్యు. పామరుడు=తెలివిలేనివాడు, ధాత్రి=ధరించునది: నానా. నెగడి—జల ములోనుండు ఒకజంతువు. ధాత్రి—పెంపుడుతల్లి, ఉసిరికచెట్టు. రూ. నిక్కము-ని క్కువము; ధాత్రి—ధరిత్రి.

47. దుష్టగుణునిన్=చెడ్డగుణముకలవానిని, తత్వము=స్వభావము, ఎఱుంగక= సరిగ్గాయెఱుగక, తడవగరాదు=వాని తెరువుకు పోగూడదు, వల్వదు=చేయవద్దు. గ్రక్కున=వేగముగా; కోపచిత్తుడై=కోపమనస్కుడై; కడున్=మిక్కిలి; తెగన్=చంపుటకు; మెఱుగన్=బాగుగా; తైలము=నూనె; పడునెడన్=పడినసమయమున. ఎగసి= ఎగిరి.

తా॥ బాగుగాగాగిన తైలము తనపైని నీటిచుక్కపడినచో మీదికెగసి భగ్గున మండును అట్లె దుష్టుడు తనకు హితము చెప్పువారలపై కోపమూని మండిపడును గనుక వానిజోలికి బోగూడదు.

రూ. వల్వదు...వలదు...వద్దు. వ్యా. భగ్గునన్—అనుకరణశబ్దము.

48. కీర్తి=యశస్సును, కోరున్=కోరునట్టి; ఆఘనగుణశాలి=ఆగొప్పగుణ ములతోకూడినవాడు; ఎదన్=మనస్సునందు; తలపోయడు=చింతింపడు; లోకహిత కార్యము; లోక=జనులకు; హిత=ఇష్టమయిన; కార్యము=పనిని; భారమైనన్= గొప్పదియైనను; పూనున్=చేయప్రయత్నించును; సహస్రముఖంబులన్=వేయిముఖ ములచేత; గ్రోలి=భక్షించి; అనిశమున్=ఎల్లప్పుడు, మోవడె=మోయుటలేదా.

తా॥ శేషుడు వాయుభక్షకుడై; లోకోపకారము నిమిత్తము, మిక్కిలి బరువ గు భూమండలము నెల్లప్పుడు మోయుచున్నాడు అట్లె లోకములో యశమును కో రువాడు తనకు ఫలము లేకపోయినను లోకహితమగు కార్యము ఎంతకష్టమయినదైన ను నిర్వహించుచుండును. గాని తనలాభము నిమిత్తము చూడడు.

వ్యు. శేషుడు=హరియతనిమీద శయనించును. నా. శేషుడు - బలరాముడు ముఖము - ప్రారంభము, వ్యా. శేషుడు - కర్త - ధాత్రి - కర్మ, మోవడె - క్రి

యు; బహుసరిము, ఆహారాస్తు; అకారాన్తము. సంఖ్యేయార్థకము.

49. అదృష్టరేఖ=భాగ్యరేఖ; విశదంబుగన్=స్వచ్ఛముగా; జనునకున్=మనుష్యునకు; ఏయ్యెడన్=ఎప్పుడైనను; పరులసంపదవల్ల=ఇతరులభాగ్యమువలన; ఫలంబు=ప్రయోజనము; కనుగవన్=రెండుకన్నులయందు; లెస్సగా=బాగుగా; వెన్నెలలు=చంద్రికలు; కాయగన్=కాయుచుండగా; ఒకరూపు=ఒకస్వరూపము.

తా॥ వెన్నెల లంతట వ్యాపించియున్నప్పటికి నందులో నుండెడు స్వరూపములు చూపుబాగుగా నున్నవారికి గనబడును గాని గ్రుడ్డివానికి గనబడదు. అట్లే పరుల సంపద లెంతట ప్రకాశమానమైయున్నను వానివలన ఫలం బదృష్టము కలవారే కాని యదృష్టము లేనివారికి గలుగదు.

వి. పగడు=శత్రువు; (శ) వెన్నెలలు—చక్కలు. వ్యా. కనుపడున్—క్రియ కనుపడు ధా - అకర్మకము - తి. ప్ర. ఏ. తనకున్ - షష్ఠీవిభక్తి - సర్వనామము - ప్రథమా ఏకవచనము తాను.

50. తాలిమితోడన్=శాంతముతో, తగవు=న్యాయము, తప్పక=విడిచిపెట్టక, ఒప్పుతప్పులన్=మంచిచెడ్డలను, అటు=అపవిని, ఉపాయవిహీనుడు=ఆలోచనలేనివాడు, నేర్చునె=సమర్థుడగునా, నీరుపరుపంగన్=విడదీయుటకు, మరాళము=హంస, మార్జాలము=పిల్లి, తదుగ్రచాతురసజ్ఞతన్, తత్=ఆహంసయొక్క, ఉరు=గొప్పదియైన; చారు=సుందరమైన, రసజ్ఞతన్=సారస్యమును, పూనక=పూనుటను; ఎఱుంగునె=తెలుసుకొనునా.

తా॥ పాలను నీటిని విడదీయుటకు హాయంస సమర్థమగును గాని పిల్లి సమర్థమైనదిగాదు. అట్లే దోషాదోషములను నేర్పరచుటకు నేర్పుగలవాడు శక్తుడుగాని నేర్పులేనివాడు శక్తికలవాడుకాడు.

వ్యు. మార్జాలము-ఎలుకనుపట్టి యింటిని శుభ్రపరచునది. రూ. మార్జాలము. మార్జారము. వ్యా. ఉపాయవిహీనుడు-మార్జాలము-యీరెండుకర్తలు.

51. కూరిమిన్=అపేక్షచేత; ఉత్తమోత్తముల్=మిక్కిలిమంచివారు; కృతఘ్నునకున్=చేసిన ఉపకారమును మరచినవానికి; మిక్కిలి=అధికముగా, కీడు=అపాయము; పాలిడి=పాలుపోసి; పెంచినన్=సాకినయెడల, చాలగన్=మిక్కిలి; ఒకచా

యన్=ఒక కాంతిని, హెచ్చునుగాక=వృద్ధిని పొందును గాని; పాయగ నేర్చునే=విడిచిపెట్టునా.

తా॥ పాముపిల్లకు పాలుపోసి పెంచినను దాని కోరలయందు విషము క్రమక్రమముగా నధికమగుచుండును గాని తఱిగిపోదు. అట్లే మంచివారు చేసిన మేలువలె చెడివానికి మేలు చేసినట్లయిన నందువలన గలుగు ఫలము మిగుల విపరీతముగా నుండును.

వ్యు. కృతఘ్నుఁడు=చేసిన మేలు మరచువాఁడు; విషము=దేహమునకు వ్యాపించునది. నా. విషము వసనాభి; ఉదకము. వ్యా. కృతఘ్నుఁడు-ద్వితీయా తత్పురుషము. పాలిడి (పాలు + ఇడి) ఉకారమునకు సంధి నిత్యము.

52 తెలియని=తెలియనట్టి; ఎల్లన్=సమస్తమును; కడతేర్చుటకు=నెఱవేర్చుటకు; ఒక్కవివేకిన్=ఒక తెలివిగలవానిని, చేకొనవలయున్=దగ్గరకు చేర్చవలయును. దిద్దుకొనవచ్చున్=తనపనిని చక్కగ చేసికొనవచ్చును. ప్రయోజనమాంద్యము=పనికి ఆలస్యము; ఫాలమందు=ముఖమందు; తిలకంబు=బొట్టును; అద్దమున్=దర్పణమును; చక్కన్=చక్కగా.

తా॥ మానవుడు నుదుటియందు బొట్టుంచుకొనునప్పుడు చేతిలో నద్దమున్నచో దానిని జూచుకొని యాబొట్టును బాగుగా దిద్దుకొనును. అట్లే తనకు దెలియని కార్యమును తుదముట్టించుటకొఱకు నేర్పరిని జేరదీసికొనినచో వానినిబట్టి కార్యమాంద్యము లేకుండ నాపనిని నిర్వహించుకొనును.

నా. ఫాలము-నాకటికన్ను; తిలకము-తిలకవృక్షము; తిలమను పేరుగల ఏనుగు-
వ్యా. చేతన్=తృతీయావిభక్తి. కాంతము- ప్రయోజనమాంద్యము- షష్ఠీ- త. పు. సమాసము; అమహద్వాచకము; ప్రథమావిభక్తి.

53 దక్షుఁడు=సమర్థుఁడు; లేనియింటికి=లేనిమందిరమునకు; పదార్థము=ధనము; వేలక్షలు=వేయిలక్షలు, పలాయనమై=పరుగెత్తినదై, చనున్=పోవును, కల్లగాదు=అబద్ధము కాదు, ప్రత్యక్షమె=దృష్టాంతమె, వాగులున్=చిన్న సెలయేఱులును, అక్షయమైన=పెద్దదియైన, తటాకములోనన్=చెరువులో, నీరు=జలము, నిల్చునే=ఉండునా.

తా॥ పెద్దసందుపడిన చెఱువులోనికి నెన్ని నదీప్రవాహములు వచ్చినను నీరు కొం

చెమైనను నిలువదు అట్లె సంసారభారము వహించెడు నధిపతి లేని యింటికి మరియొక చోటనుండి యెంతద్రవ్యము వచ్చుచుండినను నప్పుడె చెల్లిపోవునుగాని యొక్కకాసయినను నిలువదు.

వృ. అక్షయము-నశించినది. తటాకము-వంకరగాగట్టును పొందియుండునది. నానా- దక్షుడు ఒక పేరుగలవాడు. వ్యా. నిలువదు-క్రియ-నిలుచుధాతువు- అకర్మకము. ౯ ప్ర ఏ. నీరు,కర్త అక్షయమునన్—తత్పురుషము. విశేషణము.

**54.** దాన=ధర్మముచేయుటకు, పర=ఇతరులకు: ఉపకార=ఉపకారముచేయుటకును; గుణ=సద్గుణములచేతనైన, ధన్యత=ధన్యత్వమును, చిత్తములోనన్=మనస్సునందు, వివేకశూన్యులకు=తెలివితేలివానికి, లేములు=దరిద్రములు, పూనినవేళన్=క్రమ్ముకొనినప్పుడును, ఒక్కపరిపోలును=ఒక్కవిధముగానే యుండును రేయు నరున్ =గ్రుడ్డివానికి, పట్టపగలున్=మధ్యాహ్నమును.

తా॥ గ్రుడ్డివానికి, రాత్రియైయయినను బట్టపగలైనను భేదములేనియట్లె దెలియదు. అట్లే దానాదిగుణములు మనస్సులో లేని తెలివితక్కువవానికి బీదతనము వచ్చినను సంపదలు వచ్చినను నొక్కవిధముగానేయుండును.

నా. దానము-ముము, గుణ-నిస్సారము. రూ. పగలు పవలు. రాత్రి-రాతిరి వ్యా. లేము-క్రియ-కలుగు ధా-వ్యా-ప్ర- ఏ. అర్ధరాత్రి, పట్టపగలు, కర్మధారయసమాసములు మొదటిది సాంస్కృతికము, రెండవది ఆచ్ఛికము.

**55** దానము=ధర్మమును, చేయన్=చేయుటకు, కోరిన=అపేక్షించిన, నదాన్యవరున్=దాతకు, ఈయగన్=ఇచ్చుటకు, శక్తి=సామర్థ్యము, పర=ఇతరులకు, ఉపకారమునకై=మేలుచేయుటకొరకై, ఈన్=ఇచ్చుటకు, అంబుధికిన్=సముద్రమునకు, వావస=వర్షమును, కాంక్షము=కోరిక, ఇంపెసలారన్=సఫలమగునట్లుగా ఈయడే=ఇవ్వడా.

తా॥ మేఘుడు తనయొద్ద నుదకము లేనప్పుడు సముద్రుని గొద్దకుబోయి యప్పుతెచ్చి యెల్లజీవులు నానందము నొందునట్లు వర్షించుచున్నాడు. అట్లె దానముచేయ నిచ్చగలిగిన దాతయు దనయొద్ద ధనము లేనప్పుడు మరియొకచోట ఋణముగొనివచ్చి యయిన నిచ్చుచుండును.

వ్యు. వదాన్యుడు-బాగుగా మాటలాడువాడు. నా. జలము-కరివేరు- వ్యా- పూమను- క్రియ పూనుధా. త. ప్రి- ఏ- వదాన్యుడు- కర్త- సమస్తజీవులు- కర్మ ధారయసమాసము- విశేష్యము.

56. చేయనేరని=చేయలేని, అధార్మికుసంపద=మొండివాని భాగ్యము, తా నె=తనకు తానె, పలాయనంబగుట=పరుగెత్తిపోవుట, బూరుగుమాను=బూరుగుచెట్టు అభోజ్యములు=భక్షింపతగనివి; కొటన్=కాబట్టె; కానలలోనక్=అరణ్యములలో ఏమిటికిగాక=ఏయెందుకున్ను ఉపయోగింపక, పడిపోవలె=పడిపోవుట లేదా.

తా॥ బూరుగుచెట్టు ఫలించినప్పటికిని దాని ఫలములు ఎవ్వరికి దినుటకుపయో గింపక యుండి గాలిచే దూలగొట్టబడి యడవులలో వ్యర్థముగా పడిపోవుచున్నవి. అ ట్లె ధర్మబుద్ధిలేనివానికి సంపదలున్నప్పటికి నవి యాన్నట్టులేయుండి యొకరికెవ్వరి కుపయోగింపక పలాయనమగుచుండును

వ్యు- కావనము=జలము ప్రాణముకలది. నా. కాన (తద్భవమయినయెడల అడ వి) దేశ్యమయినకనుక అను నర్థముచెవ్వను. రూ. మాను, మ్రాను. కానలు - కానన ములు. వ్యా. పడిపోవవు - పడు - ధా - వ్య. ప్ర. బ. ఫలంబులు - కర్తృపదము.

57. నడుపక=సంసారముజరుగక చిక్కి=కృశించి, లేమి=దరిద్రము, అగునా డు=సంప్రాప్తమైనరోజున, నిజ=తనయొక్క, ఉదర=పొట్టను, పోషణార్థమై=పో షించుకొనుటకై, అరయన్=విచారించగా, వ్యంగ్యముకాదు=నింద్యముకాదు, బలశా లురు=బలముతోకూడినవారును, ఏవురున్=అయిదుగురును అయిన, అఖండవిభూ, తిన్, అఖండ=సంపూర్ణమయిన, విభూతిన్=భాగ్యమును, తొలగించి=వదలిపెట్టి భిక్షముల్=మధూకరాన్నములు, కుడువరే=తినలేదా.

తా॥ బలవంతులగు పాండవులయిదుగురు సంపూర్ణములగు సంపదల విడచిపెట్టి తల్లితోగూడ నేకచక్రపురంబున బిచ్చమెత్తుకొనుచు జీవించిరి, కావున లోకములో మానవుడు బీదతనమనుభవించు నప్పుడు తనపొట్టనింపుకొనుటకు బయల యాచించు కొ నిన నది నింద్యమగు పని కాదు.

నా. వ్యంగ్యము - అర్థాంతము రూ. కుంతి - గొంతి, ప్రివి. భిక్షము - బి చ్చము. వ్యా. యు, ను. ఈరెండు సముచ్చయములు, ఏకచక్రపురికిన్ —సప్తమీ ఏ

ధక్తి. రూపకసమాసము.

58. నుడువులన్=మాటలయందు, నేర్పు=తెలివి, కృపతోన్=దయతో; తజ్ఞులెల్లన్=విద్వాంసులందరు, చెలంగుదురుగాని=సంతోషించెదరుగాని, అదల్పరు=కోపపడరు; పెట్టుచున్=వేయుచు, తొడంగుదురు=ప్రారంభింతురు.

తా॥ ఎట్టి మానవులైనను బాలుడు తప్పటడుగులు పెట్టి నడచునప్పుడు వానిని ప్రేమింతురు కాని క్రిందికి బడద్రోయరు అట్లె పండితులు మాటలయందు నేర్పుచాలనివారెవరుగాని తప్పుపలికిన వదివిని సంతసింతురుకాని కోపముతో గసరరు.

వ్యా. కృపతోన్ + చెలంగుదురు=కృపతో జెలంగుదురు. ద్రుతప్రకృతికముల మీది, క. చ. ట. ప. లకు గ్రమముగా గ, జ, డ, ద, బ, లు నిత్యముగానగును. చెలంగుదురు - క్రియ - చెలంగు ధాతువు. త. ప్ర. బహువచనము, అకర్మకము. తజ్ఞులు - కర్త.

59. నేరిచి=తెలిసికొని, అతి=మిక్కిలి, నీతి=న్యాయముయొక్క; వివేకమున్=తెలివిని; చెడన్=నశించుటకు; కైకొనన్=గ్రహించుటకు, కే=నిజమె; దురాచారుడు=దుర్మార్గమయిన ఆచారముగల రావణాసురుడు, చేటుకాలము=నశించుకాలము, నిరసించి=తిరస్కరించి; అసహ్యమున్=సహింపశక్యముగాని కష్టమును.

తా॥ దురాత్ముడగు రావణుడు తనకు చేటుకాలము సమీపించుటచేత దమ్ముడగు విభీషణుడు చెప్పిననీతి దిరస్కరించెను, అట్లె లోకములో మానవుడు తనకు చేటుకాలము సమీపించునప్పుడు బుద్ధిమంతుడుచెప్పిన హితవచనముల వినని ష్టపడడు

వ్యు. రావణుడు=రావముచేయువాడు, కైలాసపర్వతమును ఎత్తినపుడు యితనీపేరును సంపాదించుకొనెను, విభీషణుడు=భయము కలుగజేయనివాడు. నానా బుద్ధి—ఇదిఅంతఃకరణవృత్తులు నాలుగింటిలోనొకటి. మనో, బుద్ధి, చిత్త, అహంకారములు. ఈనాలుగు అంతఃకరణవృత్తులు, ఇది పండ - మేధ - ధారి - గ్రహితి-గ్రాతి - చత్వారి - అనునావువిధములుకలది. బుద్ధి గుణములు యెనిమిది శుశ్రూష - శ్రవణము - గ్రహణము - ధారణము - ఊహము - అపోహము - అర్థవిజ్ఞానము- తత్వజ్ఞానము

60. నోలిగినచోన్=దరిద్రముతో నలిగియున్నప్పుడు, తన్నున్=తనను, అగపడి=కనుపించి, ప్రోదిసేయక=రక్షింపకుండగ; బల్మికిరాడు=బలమునుపొందడు, ఏ

జగమునన్=ఏలోకమందైనను, సన్నగిలంబడియున్న=సన్నపడిపోయినప్పుడు, ఇంధనంబున్=కట్టెను; ఎగఁదగన్ ద్రోచి=ఎగద్రోసి; రవుల్కొనఁజేర్చున్=మండుటకు ప్రారంభించును.

తా॥ అగ్నిహోత్రుడంత తేజశ్శాలియైనను తానుకృశించియున్నప్పుడు ప్రాయిలోనికట్టెలు బాగుగానెగద్రోసియుపాయముతో నూదినగాని తిరిగి రవుల్కొని మండదు. అట్లెయొక ఘనునకు బీదతనము సంభవించినప్పుడు మఱియొకఘనునకు బీదతనము సంభవించినప్పుడు మఱియొకను వానిని ప్రేమతో జేరదీసి పోషించినగాని తిరిగి బలమును బొందలేడు.

యా, నొలిగిన - నలిగిన, వ్యా. ఊదక - వ్య. క్త్వా- అ. భావార్థకము ఊది. అసమాపకము.

61. పండితులు=విద్వాంసులు, దిగువన్=క్రింద, అల్పుడు=నీచుడు ఉద్దండతన్=దుష్టత్వముచే, బుధప్రకరంబులకున్=పండితసమూహమునకు, ఎగ్గు=కీడు, గండ...నికురుంబములు, గండభేరుండ=గండభేరుండమనెడి పక్షులయొక్కయు, మదేభ=ఏనుగులయొక్కయు, సింహ=సింహములయొక్కయు, నికురుంబములు=సమూహములు, చేరి=కూడి.

తా॥ చెట్టుక్రింద గండభేరుండము మొదలగు మృగములుండఁగ నాచెట్టుకడకొమ్మలయందు నొకకోతి యున్నప్పటికి నామృగములకేమియు లోపములేదు. అట్లె పండితులు క్రిందనుండు సమయమున నీచుడొకడు పీటమీదకూర్చున్నప్పటికి నంతమాత్రమున నాపండితులకేమియు గొఱంతలేదు.

వ్యు. పండితులు=జ్ఞానముకలవారు, సింహము=హింసచేయునది. నా. పీఠము=మఠాదికారిస్థానము; బుధులు=దేవతలు; కొమ్మ=స్త్రీ, సింహము=ఒకరాశి. వ్యా. పీఠము + ఎక్కఁనన్, అచేతనవాచకము కర్మ అయినప్పుడు కర్మ వైకల్పికముగా ప్రథమయగును. పీఠమెక్కఁనన్, పీఠము నెక్కఁనన్.

62. మదముబట్టి=గర్వముచేత, పట్టుగన్=పట్టుదలగా, నిక్కుచున్=నిగుడుచు, తూలనాడినన్=నొవ్వబలికినచో, చెడును=నశించును, నిరర్థదోషముల్=నిమిత్తములేని పాపములు, పుట్టున్=సంభవించును, మహేశున్=ఈశ్వరుని, కాద

ని = ధిక్కరించి, కుబుద్ధిన్ = కుత్సితబుద్ధిచేత, ముట్టక = నెఱవేరక, మోసము = చేటు,

తా॥ శివునియందలి కోపముచే నతని బిలువకుండ దక్షప్రజాపతి యజ్ఞమాచరించెనుగాని యది నెఱవేరలేదు. సరియేకదా యతని ప్రాణములుకూడఁబోయెను. కావున దుష్టుఁడు మదముచే గ్రిందుమీఁదుగానక నిక్కుచు మహాత్ముల ధిక్కరించి తానొక కార్యము చేయఁబూనినచో నాకార్యము చెడును. జీవములు పోవును. గొప్పదోషములు గూడ సంప్రాప్తమగును.

నా వా. దోసము-చేయి, దక్షుడు- సమర్థుడు. వ్యా. మహాత్ములన్- ద్వితీయావిభక్తి- వి- శే. వ్యు- బహువ్రీహి. మహేశున్- ద్వి- కర్మధా- విశేష్యము. ముట్టక- ముట్టు- ధా. వ్య- క్త్వార్థకము. భావము ముట్టి.

63. పరహితము = పరులకు మేలుచేసెడిది; లోకముల్ = జగమందలి జనులు, పొగడఁగ = నుతించునట్లుగా; పూర్వమునందుఁ = తొల్లింటికాలమున; గొబ్బునన్ = వేగముగా; కదిసి = దగ్గరగాబోయి; గోజనరక్షణార్థమై = గోవులను గోపాలకులను రక్షించు నిమిత్తము ఒకకేలన్ = ఒకచేతితో; ఎత్తెనట = పైకి బట్టుకొనెనట,

తా॥ దేవేంద్రుఁడు కృష్ణునిపై కోపముచేత నతనిని నతని గోవులను గోపాలురను బాధించుటకయి జాలవాన గురియించుచుండఁగా దా నొకకొండను గొడుగుగాబట్టుకొనినట్లు మహాత్ముఁ డెంతకష్టమగు కార్యమైనను పరహితముకొఱకు జనులు నుతించునట్లు చేయుచుండును.

వ్యు. కృష్ణుడు = శత్రువులను సంహరించువాడు; ఛత్రము = నీడనిచ్చునది.

నా నా. గో = కిరణము, వ్యా- పూను క్రియ పూను-ధాతువు ప్రే- పూనుచు-తుమున్నర్థకావ్యము- జాయి- కొన్నియకారాంత శబ్దములందొన టుకారమునకు లు కారము వచ్చును.

64 పలుచని నీచమానవుఁడు = మిగుల జాలుకనిమనుష్యుడు; పాటి = న్యాయమును; తలంపక = విచారింపక, నిష్ఠుర + ఉక్తులన్ = కఠినవాక్యములను మతిభాసురుఁడు = బుద్ధిచే ప్రకాశించువాఁడు; అయిన గుణపరిపూర్ణుఁడు = అయినట్టి గుణములచే నిండిన మనుష్యుడు; అప్పలుకులను = అటువంటి మాటలను; నిబద్ధిగ = నిజముగ పలుకఁబోవఁడు = సంభాషింపఁబోఁడు; వెలికుండ = వెలిగానున్నకుండ; నిండుఘటం

బు=నీటిచే నిండుగ నింపబడినకుండ, తొల్కాడు=తొణకదు.

తా॥ వెల్తియగుకుండ తొణకులాడునట్లు నీచమానవుఁడెల్లప్పుడు వదరుచుండును నిండినకుండ దొలుకాడని విధముగా సుగుణములుగల మనుష్యుడు అధికప్రసంగములకు బోకయుండును

వ్యు. ఉత్తులు=బలిసినవి; మతి=దీనిచేత నెరుగబడును. నానా. మతి- ఇచ్ఛ; తలఁపు కుటము; ఏనుగు కుంభస్థలము- ఏనుగు సమూహము; శిఖరము, పాడును ఝ్యు- (రూ) వలితి- వెల్తి- వ్యా. నిష్ఠురోక్తులు- కర్మధారయసమాసము. అప్పులుకు లు- క-ప-స మా.ర- వర్ణకములు పరంబులగు నప్పుడుదక్క- అ- ఈ-ఏ- లు తాము హ్రస్వముంబొంది మీఁదివర్ణములకు ద్విత్వాగమ వికల్పంబుగా పుట్టించును. అప్పులుకులు - అపలుకులు.

65. సజ్జనుండు=మంచివాఁడు; పలుమాఱు=తరచుగ, ప్రియభాషలే=మంచి మాటలే; కర్కశవాక్యముల్=పరుషవచనములు; పలుకఁడు=మాటలాడఁడు, కీడుసేకాఁడు=చెరుపుకాఁడు; నిక్కము=నిశ్చయము, చలువకు=చల్లఁదనము కలిగించుటకు; గాల్చినన్=వడబైచినను; శీతలనీరము గాక=చల్లనైననీరుకాకుండ; శిలలగునోటు=రాళ్ళవలె గట్టిగానుండునా.

తా॥ మేఘుఁడెల్లప్పుడు చల్లనినీటిబిందువలనే వర్షించుచుండును. ఒకప్పుడువడగండ్లు రాల్చుచున్నను నవియును రాళ్ళవలెనుండక చల్లనినీరుగానే మారును. అట్లే సజ్జనుఁడెప్పుడు మంచిమాటలనే పలుకును. ఒకప్పుడు కఠినవచనములు పలికిన నవి యపాయము కలిగించక మంచిమాటలుగానే మారుచుండును.

వ్యు. నీరము=జల్లముసుపొందునది. నానా- కఠోరము- సంపూర్ణము శిల- సెల రాయి శీతలము- పత్యుత్తధాతువిశేషము; చందనము. రూ పలుమఱు- పలుమారు; శిల- సిల; వ్యా. ఓఁటు=ప్రశ్నార్థకము.

66. పాపపు దోవవానికిన్=దుష్టమార్గముగలవానికి; ఒకపట్టునన్=ఒకసమయమందు; మేలు=[illegible]; [illegible]=ప్రకాశము; ఒందినన్=పొందినప్పటికి; ప్రబలంగరా=వృద్ధిపొందుటకుగదా. పాపటకాయకున్=పాపటకాయకు (వ్యర్థమా చెట్టు కాయకు) మనుగు=[illegible], కరడుగట్టుచేదు=[illegible] [illegible]

ణము, నశించున్ = పోవును.

తా॥ పాపటకాయకు మీదిభాగము నున్నగా నుండినను లోపలనున్న చేదుగుణముపోదు అట్లే దుర్మార్గుని కండమొకకొలది గల్గినను మనస్సులోనున్న దుర్గుణములుపోవు కావున వాని నమ్మగూడదు

వ్యా. పాపపున్ × తోఁవ, విరుద్ధమున్ × చేదు; సమాసమునందు ఈకారాంతములకు స్త్రీ సమశబ్దములకు మువర్ణకమునకాదేశముగావచ్చు; పుంప్వు; వర్ణములకును పరుషసరళములు పరమగునపుడు ద్రుతము అంతాగమముగావచ్చును. పాపపుందోఁవ; విరుద్ధపుఁజేదు, దుర్గుణంబు × ఏ- ఏకారము. అవధారణార్థకము.

67. పూనిన భాగ్యరేఖ = మునుపు తన్నుబొందిన యదృష్టరేఖ, చెడిపోయినపిమ్మటన్ = చెడిపోయినతర్వాత, ఎచ్చటన్ = ఏస్థలమందైనను, ప్రియంబునన్ = ప్రీతిచేత, పల్కరు = మాటలాడరు, పిల్వరు = రమ్మనరు, తథ్యము = నిజము, వాడి = ఎండిపోయి, వాసనాహీనతన్ = మంచివాసనలేకపోవుటను, ఒందిన్ = పొంది, ముట్టరయ్య = తాకరురా.

తా॥ పుష్పము వాడి సువాసనలవిడిచియున్న కాలమున నెవ్వరు స్వీకరింపరు. అట్లే భాగ్యరేఖచెడియున్న మానవు నెంతటివాడయినను రమ్మని పిల్వరు. మరియు ప్రియముతో మాట్లాడరు.

వ్యు. పుష్పము = వికసించునది. భాగ్యము = సేవింపతగినది. వ్యా. వాడి, వాడు ధాతువు, క్త్వా. అ, కళ, ఎవ్వరు సర్వనామము.

68. పూరితసద్గుణంబులు = నిండియున్న మంచిగుణములు, కలపుణ్యునకున్ = కలిగినట్టి పుణ్యాత్మునకు, ఇంచుక = కొంచెము, రూపసంపదల్ = సౌందర్యముయొక్క సమృద్ధులు, దొడ్డగాన్ = గొప్పగా, లోకులు = జనులు, గొడ్డుగైనన్ = ముడితలం పడియున్నప్పటికిని, ప్రియముచొప్పడన్ = వానియందు దమకు ప్రీతికలుగునట్లుగా, కొంటు = కొనుచుండుట, అంటుకొన్న = ఆఫలము అయియున్న, మాధురిన్ = తియ్యదనమును.

తా॥ ఖర్జూరఫలములు ఎండవలన గడగడకపోయినను వానియందుగల తియ్యదనమును బట్టి జనులందరు ప్రీతిచేత గొనుచుందురు. అట్లే సద్గుణములుగల వానికి సంపదయు లేకపోయినను బుద్ధిమంతులు వానిని గొప్పవానిగాబట్టి గౌరవించుచుందురు.

నా నా. రూపము. శుక్లపీతాది వర్ణములు, నాటకము, స్వభావము, రూ. మాధురి—మాధుర్యము—మధురత్వము. కోఁట—కోనుట వ్యా. కోఁట. క్రియావాచక విశేష్యము.

69. పిల్లదనంబుచేన్ = పడుచుపోరుతనముచే, ఎఱుకపాటు = జ్ఞానము, ఇంచుక లేక = కొంచెమైనను లేక, ఎచ్చటన్ = ఏస్థలమునందైనను, బల్లిదుఁడు = బలవంతుఁడు, తుంగిపోదుర = నశింతురు, పాతంబగుచెల్లన్ = చంపబడుటెంతయుయోచింప, అల్లసభాస్థలిన్ = ధర్మరాజు రాజసూయయాగమునందలి సభలో, కల్లలుపల్కఁగాదె = అబద్ధములాడుటచేకదా. అనఁగా నిందించుటవలననేకదా.

తా॥ ధర్మరాజు చేసిన రాజసూయయాగమున గూడిన సభలో గ్రిందుపిల్లలుఁ జూచుకొనక శిశుపాలదంతవక్త్రులు కృష్ణుని నిందించి యతనిచేత మృతినొందిరి. అట్లే మానవునకు జ్ఞానము లేకుండ బలవంతుఁడగు ప్రభువును నిందించినచో దప్పక మృతినొందును.

రూ. పిల్లదనము - పిల్లందనము, వ్యా పిల్లన్ + తనము = పిల్లందనము, ఈయాగమును తనవర్ణకము పరమయినప్పుడు సంబంధము అకారాంత విశేషములకు వచ్చును. పిల్లదనము, పిల్లందనము, పిల్లద్దనము.

70. ప్రేమనుగూర్చి = తమకోరుదలయందుండు ప్రేమమును పురస్కరించుకొని అల్పునకున్ = నీచునకు; పెద్దతనంబును = గొప్పయుద్యోగమును, దొడ్డవానికిన్ = గొప్పవానికి; తుచ్ఛుఁడంబని = నీచుఁడవని, ఎదన్ = మనస్సునందు, పరికింపక = యోజింపక తోచినచేతలుగాక = తోఁచినదేని కార్యములుగాని వామకరంబుతోడన్ = ఎడమచేతితో దినుచున్ = తినుటయును; అపానమార్గమున్ = గుదస్థానమును; తోమఁగన్ = శుభ్రము చేయుటయును; వచ్చునే = కూడునా,

తా॥ లోకములో మానవునికి నెడమచేతితో దినుటయు కుడిచేతితో గుదశుభ్రము చేసికొనుటయును నెంతమాత్రము తగదు. అట్లే ప్రభువులకు నీచునికి గొప్పయధికారమిచ్చుటయు గొప్పవానికి నీచుఁడవనిచెప్పుటయును గూడదు.

నా నా. వామ = సుందరమైనది. (రూ) తుచ్ఛుఁడంబని—తుచ్ఛుఁడన్వని, ఈ యకారాదులద్వయంబరాదు. వి. పం. చేత (సం) చేష్ట వ్యా. కూర్చి - ద్వితీయావిభక్తి

పరిత్యయము కళ-

71. ఫలము = రాజువలనఁ గలిగెడు లాభము; అతిసూక్ష్మమైనన్ = మిక్కిలి కొంచెమయినను; నృపాలుఁడు = రాజు; గుణాఢ్యుఁడు = గుణములతోఁ గూడినవాఁడు; ఎలమిన్ = సంతోషముతో; వివేకులు = జ్ఞానముకలవారు అపేక్ష యొనర్తురు = కోరుచుందురు; చంద్రికా = వెన్నెలయొక్క; విలసత్ + ఐన = ప్రకాశముకాఁగా (రాఁగా) చకోరములు = వెన్నెలపులుఁగులు; చలువగలట్టివాఁడు = చల్లనివాఁడు; చందురున్ = చంద్రుని; కోరి = అపేక్షించి, అనుభవింపన్ = భక్షించుటకు చేరవే = సమీపమునకు వెళ్లవా.

తా॥ చకోరపక్షులు చంద్రునివలన దమకు కాంతిమాత్రమే కాని విశేషఫలము లేకపోయినను చల్లనివాఁడను కారణమున నాతని రాక గోరుకొనుచుందును. అట్లె రాజు మంచివాఁడయినచో నతనివలన గలిగిన ఫలము మిగుల నల్పమైనను సంతసముతో నాతనినే యపేక్షించుచుందురు.

వ్యా. నృపాలుఁడు = మనుష్యులను పాలించువాఁడు; చంద్రికా = చంద్రునితోఁ గూడినది; శా. వా. చంద్రికా = కుసుమపువ్వు.

రూ. చకోరము — చకోరకము; చందురుఁడు, చంద్రముఁడు.

నా. అ. బె. శ. చంద్రుఁడు — చంద్రము = కర్పూరము; నీళ్లు; బంగారు.

,, — చంద్రభాగ = ఒకయేఱు

,, — చంద్రబీజము = కెండి

,, — చంద్రకి = నెమలి

72. బంధుర = దట్టమయిన; సత్ = యోగ్యములయిన; గుణ = గుణములచేత ఆఢ్యుఁడు = నిండినవాఁడు; ఒకప్పుడున్ = ఒకసమయమందు; లంపటన్ = ఆయాసమును; ఒందియైనను = పొందినప్పటికిని; అన్యులకున్ = ఇతరులకు; చాలన్ = అధికముగా; ఒనరించున్ = చేయునుగాని; దుశ్చింతన్ = ప్రతికూలమయినదానిని. తలంపఁడు = యోచింపఁడు; శ్రీగంధపుచెక్క = మంచిగంధపుచెక్క; రాగిలుచున్ = ప్రకాశించుచు, గంధములు = పరిమళములు; తఱుగంబడి = తగ్గిపోయియుండుట; ఉత్సాహార్థము = కోఁతకనిమిత్తము; ఐకాదె = అయిపోదా.

తా॥ మంచిగంధపుచెక్క మనోహరమగు పరిమళము గలుగునట్టుగా దరిగిపోవు

ము జనులకు వేడుక కలిగించునట్లు మంచిగుణములు కలవాడు తానొక్కఁడె కష్టము చెందుచున్నను బరుల కపకారము చేయదలంపక మేలే చేయుచుండును.

టీ. బంధురము - కిరీటము; సంధి=శత్రువులతో కలయుట; ఇది కోశప్రధానహేతుకము; దండప్రధానహేతుకము; భూమిప్రధానహేతుకము అని మూఁడు విధములు; రూ. బంధురము - బంధూరము; రాగిలు - రాగిల్లు. వ్యా. అన్యుఁడు . సర్వనామము.

73. తొలంగుకాలమునన్=విడిపోవు సమయమున; ప్రాభవ=ప్రభుత్వమందలి సంపదలు=ఐశ్వర్యములు; నిలుపుకొనంగన్=ఉంచుకొనుటకు, ఓపఁడు=సమర్థుఁడు కాఁడు; ఈశ్వరాదులన్=ఈశ్వరుఁడు మొదలగువారలను; బోయలకున్=కిరాతులకు; కీడ్పడి=స్వాధీనముగా; పలువురన్=అనేకమందిని; నిలుపఁబట్టన్=ఉంచుటకు; సమర్థుఁడు=బలముకలవాఁడు.

తా॥ శివుఁడు మొదలగువారిని జయించిన యర్జునుఁడు కృష్ణనిర్యాణమయిన తరువాత నాతని భార్యలను బోయలనుండి తప్పింపశక్తి లేక వారల కిచ్చివేసెను. కావున దైవబలము లేనప్పుడెంతటి ధన్యుఁడును దన ప్రభుత్వసంపదల నిలుపుకొన జాలఁడు.

టీ. ఈశ్వరుఁడు - రాజు; అర్జునుఁడు - కృతవీర్యుని కొడుకు; తల్లికొడుకు. రూ. అ. బె. క. అర్జునుఁడు=అర్జునము - కసవు, బంగారము, మద్దిచెట్టు. వ్యా. ఈయఁడు. క్రియ. సకర్మ. వ్య. ప్ర. ఏ. అర్జునుఁడు. కర్త.

74. బలయుతుఁడు=బలవంతుఁడు; నిబంధుఁడు=తనచుట్టము; తోడ్పడుగాని=సహాయపడుఁగాని; తొలంగినని=తాను విడిచిపెట్టియున్నట్టయిన; తనపాలిటిశత్రువు=తనకు శత్రువైయుండుఁ; జ్వలనుఁడు=అగ్నిహోత్రుఁడు; కానన్=అడవిని; వాయుదేవుఁడు=గాలి; సఖ్యము=స్నేహము; అబలియుఁడు=అగ్నిహోత్రుఁడు; అగుపట్టునన్ అయినట్టి; సమయమునందు; ఆర్పఁడె=నశింపఁజేయఁడా.

తా॥ అగ్నిహోత్రుఁడు మిక్కిలి బలముగలవాఁడయి యడవిని గాల్చునట్టిసమయమున వాయువు సఖ్యము జూపుచు నతనికి తోడుపడునట్లు లోకమున మానవుఁడు బలవంతుఁడై యున్నప్పుడు తోడుపడుచుందురు. కాని యగ్ని చిన్నదీపమైనసమయమునందు నా వాయువే శత్రువై యార్పుచున్నట్లు మానవునికి బలము లేనప్పుడు పూర్వము

77. భూనుతులయిన=లోకమందలి జనులచే స్తోత్రము చేయబడినట్టి, వావివర్తనల్=వరుసలను, మర్యాదలను, మాని=వదలిపెట్టి, చరింపరే=సంచరింపలేదా; చరింపన్=సంచరించుటకు, పోలదు=సరిపడదు, అంభోనిధులన్నియున్=సముద్రములన్నింటిని, తనదుపుక్కిటన్=తననోటియందు; అపూనికడున్=అపరిమితమైనవాడు: ఓపున్-సమర్థుడు, పూర్వమహాత్ములసుమ్ము=పూర్వులయొక్క గొప్పతనముసుమా.

తా॥ పూర్వులు దేవతలుకొందరు తప్పుమార్గములం బ్రవర్తించిరని మానవులట్లు చేయకూడదు. ఏలచేయకూడదనినచో అగస్త్యుడు సముద్రముల బుడిపిటబట్టినట్లుగ మానవులెవ్వరైన బట్టగలరా. వారికట్టి మహిమల గొప్పదికనుక వారితో మనము సాటిని చెప్పకోరాదు.

నీతి: దేవతైనను చేసిన మంచినిగ్రహించవలసినది, దుర్మార్గమును గ్రహింపరాదు

78. భూపతికిన్=రాజునకు, ఆత్మబుద్ధి=స్వకీయమైనబుద్ధి, మదిన్=మనస్సునందు: ప్రధానులు=మంత్రులు, ఎంతప్రజ్ఞాపరిపూర్ణులు=ఎట్టువంటి బుద్ధితో నిండినవారయినను, కార్యము=పని; కొనసాగదు=నెఱవేరదు; కార్యదక్షులయి కార్యములు నెరవేర్పుటయందు నేర్పరులయి; ఓపిన=చాలియున్న; అనేకులు=పెక్కుండ్రు; కౌరవపతి కార్యము=దుర్యోధనుని కార్యము. చాలిరె=సరిపోయినారా.

తా॥ కొంచెమైనను కార్యాలోచనలేని దుర్యోధనుని కార్యమును కార్యదక్షులైన భీష్మాదులు నెరవేర్పలేకపోయిరి. కనుక రాజునకు స్వకీయమైన యాలోచనలేనప్పుడు మంత్రులెంతగొప్పవారైనను కార్యము నెరవేర్పలేరు.

వ్యు. యోధుఁడు=యుద్ధము చేయువాడు. నా.సా. ప్రధాని=ముఖ్యుడు, వ్యా. అనేకులు. వాను. సర్వనామములు.

79. తలపోయక=ఆలోచింపక, భూరిబలాఢ్యుడు=గొప్పబలశాలి, విక్రమశక్తి చేన్=పరాక్రమాతిశయము చే; అహంకారము=నేనే సర్వమును చేయుచున్నాననుగర్వము, ఒందుటల్=పొందుటలు, ఒక్కెడన్=ఒకస్థలమందు, వీరవరేణ్యుడు=వీరులలో గొప్పవాడగు, వింటికిన్=ధనస్సునకు; అధికుండన్=గొప్పవాడను, లేమికి=లేకపోవుటవేళ, మీరక=మిన్నక, ఎక్కిడగన్=ఎక్కుపెట్టుటకైనను, ఓపడు=శక్తుడు కాడు.

తా॥ అర్జునుడు ముల్లోకములలోను దానికి గొప్పవిలుకాడని గర్వపడుచు కృష్ణనిర్యాణానంతరమున కృష్ణుని భార్యలను రక్షించునిమిత్తము తనవింటినైన నెక్కుపెట్టలేకపోయెను. అట్లే మానవుడును తానెంత బలవంతుడైనను నేనే గొప్పబలవంతుడనని గర్వింపగూడదు. అట్టి బలవంతునకుగూడ కొన్నిసమయమున మోసపోవుచుండును.

వ్యు- అర్జునుడు - తెల్లనివాడు, వ్యా॥ వింటన్ = ఔపవిభక్తికాంతము, ద్వితీయావిభక్తి- ప్రథమా- విల్లు, తేసి - కఱగుధాతువు, కృదంతము - ఊరక - గ్రామ్యము

80. బ్రద్దునకున్ = చెడిపోయినవానికి, అర్థవంతులగు = ధనవంతులయ్యు; బాంధవులు = బంధువులు, నిజ = తనవి; అదృష్టము = భాగ్యము, దరిద్రతన్ = దారిద్ర్యమును, వాపగలేరు = పోగొట్టజాలరు, సత్కృపా = మంచిదయతో గూడిన, దృష్టిని = చూపును, అతిస్థిరసంపదలు = మిక్కిలి శాశ్వతమైన భాగ్యములు, పుట్టి = జన్మమెత్తి; ఆజేష్టకు = ఆపెద్దమ్మకు; కలుగజేయదు = భాగ్యమునివ్వదు

తా॥ లక్ష్మీదేవి దయామయములగు తనచూపులు లోకులపైనిల్పి యధికైశ్వర్యములనిచ్చుచు దనతో బుట్టినదైన జేష్ఠకైశ్వర్యముల నీయలేకున్నది. అట్లే బ్రద్దునకు ధనవంతులగు బంధువులెందరున్నను వారియొక్క పేదతనము మాన్పలేరు.

వ్యా- ఇయదు - క్రియ. ఈయుధాతువు- ప్ర- ఏకవచనము.

81. మంచిగుణోన్నతుడు = సుగుణములచే వృద్ధినొందియున్నవాడు, మదిన్ = మనస్సునందు, ఆసపడ్డయెడన్ = ఆశించిన సమయమునందు; ఎట్టిహీనునిన్ = ఎటువంటి నీచునినైనను, అవశ్యము = తప్పకుండ, ముందుగన్ = ముందుగా, అదరించుగా = ప్రేమించునుగదా, కృపామతిన్ = దయాస్వభావముచేత, పారిజాతము = కల్పవృక్షము, సురావళి = దేవతాసమూహము, మూగి = ముట్టుకొని, త్రిదశవిమానమధ్యమునన్ = దేవతల విమానమునందు, ముందలన్ = ముందుగా.

తా॥ ధర్మరాజా తన్నుపొందదలచుకొనిన వాంఛితంబిచ్చుచున్న కల్పకము దేవతలైశ్వర్యము చెందునట్లు దేవవిమానముమీద గూర్చుండబెట్టెను. అట్లే సుగుణవంతుడు తన్నాశ్రయించిన వాడెంత హీనుడైనను వానివిడువక మరియు సమయము వచ్చినప్పుడు ముందుగా నాదరించుచుండును.

వ్యు. త్రిదశులు = ముప్పది యేండ్లకు లోబడిన వయస్సుకలవారు. సారమేయ
ము, సరమా - అనగా ఆకుక్క, దానికిపుట్టినది సారమేయము - సురలు - వ.
శాశించువారు. నానా. త్రిదశ = మూడుదశలు, ఆవళి = పంక్తి. రూ. అ. షె. త్రి
ఆవళి. ఆళీ = కుమ్మెర, వ్యా- ధర్మజుడు. సారమేయమున్, ఇడగె - ఈమూడు
వరుసగా, కర్త, కర్మ, క్రియలు,

82. అభిమానసమగ్రుడు = అభిమానముచేనిండినవాడు; ప్రాణహాని = ప్రాణము
ల కపాయము, ఓర్వజాలక = సహింపలేక; రాజరాజు = రాజులకురాజయిన దుర్యో
ధనుడు, కొలకులోపలన్ = సరస్సులో; అతినీచము లాడినన్ = ధర్మరాజు తుచ్ఛవచన
ములు పలుకగా; పోరాటము = యుద్ధము, సలిపి = చేసి; పడగాయెనె = లోకులు
నరిగిపడలేదా.

తా॥ పాండవయుద్ధాంతమున దుర్యోధనుడు శత్రువులకోడి యొకకొలంకు
లో జలస్తంభనచే దాగియుండి ధర్మరాజాదుల నీచవచనముల కోర్వలేక యుద్ధము
చేసి భీముని చేజచ్చె. అట్లే అభిమానవంతుడు తన ప్రాణములపైన నను పరులు
పల్కు కారుమాటల సహింపలేడు. వ్యు. భీముడు = భయంకరుడు. నానా. రాజరా
జు — కుబేరుడు, రూ. కొలంకు - కొలకు వ్యా॥ నీటన్ జౌపవిభక్తికాంతము. రా
జరాజు కర్త; పడగాయెనె - క్రియ.

83. మానవనాథుడు = ప్రభువు; ఆత్మరిపుమర్మమున్; ఆత్మ = తనయొక్క; రిపు =
శత్రువుయొక్క; మర్మమున్ = రహస్యమును; ఏలినన్ గాని = తనయొద్దకు తీసుకొన్న
గాని; అరులన్ = శత్రువులను; శాస్త్రఖదక్షుడు = సమస్తవిద్యయందు సమర్థుడైన; ఆదాన
వనాయకున్ = ఆరాక్షసాధిపతియగు రావణాసురుని; తదీయ = ఆరావణాసురుని సం
బంధమైన; నాభికా = బొడ్డుయొక్క; స్థాన = ప్రదేశమందైన, సుధన్ = అమృతము
ను; తార్కొని = సమీపించి; ఎటుల = ఏప్రకారము; ఒప్పున్ = సమర్థుడగును.

తా॥ రావణునిబొడ్డునందు నమృతకలశమున్నదని విభీషణుడు రామునితో
చెప్పకపోయినచో అతడెంతటి విలుకాడయినను రావణుని జంపలేకపోయియుం
డును. కావున రాజునకు శత్రువుల మర్మములు నెఱింగిన మానవుడులేనిచో నాతడు
తన పగవారిని జంపలేడు.

రూ॥ ఘటించు - ఘటియించు, సంశయము - సంసయము; వ్యా. ప్ర. చతుర్థీ విభక్తి ప్రత్యయము కై.

86. మును = పూర్వజన్మమందు; ఒనరించు పాతకము = చేసినపాపము; అమోఘము = వ్యర్థము పోదు; జీవులకున్ ఎల్లన్ = ఎల్లప్రాణులకును; పూని = ప్రయత్నించి, అనుభవింపక = తానుచేసిన పాపఫలమును పొందక, తీఱదు = వదలిపోదు, పడ వేసి = చంపి, మునుపడన్ = తిరిగి, లీలన్ = విలాసముగా; యదువంశ్యుడై = యదువంశమునబుట్టినవాడయి; కిరాతు చేన్ = ఎఱుకవానిచేతను; వినిశిత బాణపాతమునన్ = వాడియగు బాణముయొక్క దెబ్బచే; తన మేను = తనశరీరము, విడువడే = విడిచిపెట్టలేదా.

శ్రీరాముడు వాలిని జంపుటవలన గలిగిన పాపఫలమును కృష్ణావతారమున నెఱుకచే దెబ్బతిని తనశరీరమును విడిచిపెట్టి యనుభవించెను. కావున నెటువంటి మహానుభావుడైనను పూర్వజన్మమున జేసిన పాపము తరువాతి జన్మమున తప్పక యనుభవింపక తీరదు.

వ్యు- రాఘవుడు = రఘుకులమందు పుట్టినవాడు. వ్యా. తద్ధి. ష॥ శో. ను. ధా. రాఘవుడు శత్రు. నా నా. రాఘవుడు = రఘుకులమున పుట్టిన ప్రతివానిని రాఘవుడని చెప్పవచ్చు.

87. శుభకారుఁ = శుభము కలిగించుటకు ముఖ్యమైనవాడా, సన్మునిసేవ్య = మునులచే సేవింపదగినవాడా, రాకొమరుల్ = రాజకుమారులు, మన్ననన్ = గౌరవముతో, తిరంబుగన్ = నిలుకడగా, రసజ్ఞుని = రసికుడైనవానిని, మూఢుని = మూర్ఖుని, ఉంపరు = ఉంచనీయరు, చేకొని = చేతబట్టుకొని, ముద్దుగన్ = ముచ్చటగా, కాకిను = కాకిని, పెంతురా = పోషింతురా.

తా॥ లోకములో మానవులు ముద్దులుగులుకునట్లు పద్యములు చదువుచిలుకను పెంతురు కాని కాకిని పెంపరు. అట్లే రాజులు రసజ్ఞుని జేరదీసి పోషింతురు గాని మూర్ఖుని పోషింపరు.

రూ. చిలుక - చిల్క - రూ) అ. చ. శ. కొమాయుడు. కొమరు. స్త్రీ. ఏ. ప్ర. కొమరుడు. ప్ర- కుమారుడు- వ్యా. రసజ్ఞుడు. ద్వితీయాతత్పురుషము.

88. లోకములోన్ = జగత్తునందు, దుర్జనులలోతున్ = దుర్మార్గులయొక్క వ

నస్నను, ఎఱుంగక = తెలిసికొనక, సుశ్లోకుడు = సత్పురుషుడు, చేరరాదు = వారిని సమీపించగూడదు, కవయన్ = ముట్టుటకు. ఎక్కసక్కెముల్ = ఎగతాళిమాటలను, కోకిలన్ = కోయిలను, కన్నచోటన్ = చూచినప్రదేశమందు, గుమికూడి = గుంపుగూడి; కాయము = కోవెలయొక్క శరీరము, తల్లడమందగ = చలించునట్లు, తఱిమి = వెంబడించి, తన్నవె = తన్నవా.

తా॥ లోకమునందు మంచివాడు దుర్జనుల యభిప్రాయము తెలిసికొనకుండ వారిని చేరగూడదు. అట్లుచేరినచో గాకులు కోకిలను జూచినప్పుడు చుట్టును మూగి రోతపుట్టించెడి కూతకూయునట్లు దుర్జనులు మంచివానిని జుట్టుముట్టి యెగతాళి చేయుదురు.

వ్యు. కోకిల = తనపలుకు వినెడివారి మనస్సు గ్రహించునది. కాకము = కాకా. అని కూయునది. వ్యా- చేయుదురు; తన్నవె; ఇవి క్రియలు; దుర్జనులు కాకులు. ఇవి వరుసగా కర్తృపదములు

89. లోను = మనస్సు; దృఢంబుకాని = గట్టిదికాని; పెనులోభిని = పెద్దలోభగుణముకలవానిని; అసాధ్యకార్యముల్ = నెరవేర్పలేని పనులను, కానక = తెలిసికొనక; పూనునేని — ప్రయత్నము చేయునెడ; గ్రక్కునన్ = వేగముగా; కూలును = నశించును. ఓటిపుట్టపైన్ = పగిలిన పడవమీద, ఒకలోతునన్ = ఒకలోతైన జాలులో, కడసి = పడిపోయి; తరింపగలేక = దాటలేక; ఒకమాటు = ఒకపర్యాయము, పుటుక్కునన్ = పుటుక్కుమని, మునుపకుండునె = మునుగకయుండునా.

తా॥ శిథిలమగు పడవమీద మానవుడెక్కి మిగులలోతుగల యొకజలప్రవాహమును దాటుటకు బ్రయత్నించెనేని ఆపడవయందొరగి తప్పక వానిని ముంచివేయును. అట్లె మనుష్యుడు దృఢమగు చిత్తములేని లోభినినమ్ముకొని యొకగొప్పకార్యమునకు బూనినచో వాడు వానిమూలమున దప్పకనశించును.

వ్యా- పుటుక్కున- ఇది అనుకరణశబ్దము.

90 వంచన = శక్తిలోపము, ఇంతలేక = కొంచెమైనను లేక, ఎటువంటి మహాత్ములన్ = ఏలాటిగొప్పవారిని, ఆశ్రయించినన్ = సేవించినప్పటికి, మేలు = సుఖము సమకూడదు = రాదు; సంచితబుద్ధిన్ = సంపాదింపబడిన బుద్ధిచేత; బ్రహ్మన్ = బ్రహ్మదే

వుని, ఆనీకంబును=ఎల్లప్పుడు, వీపునన్=వీపుచేత, మోయుచున్నట్టి రాయంచవున్=మోయుచున్నట్టి రాజహంసకు; దుంపతూండ్లు=తామరకాడలు; ఫలము=బ్రహ్మనుమో సినఫలము.

తా॥ లోకములు నిర్మించెడు బ్రహ్మను దనవీపుచేత నెల్లప్పుడు మోయుచున్న రాజహంస తక్కినవానివలె దామరతూండ్లు భోజనమే చేయుచున్నది. కావున నదృష్టహీనుడెంతగొప్పవారి నాశ్రయించినను సాధారణఫలమేగాని విశేషఫలములభింపదు

ప్ర- వి- బ్రహ్మ - బమ్మ, వి. ప్ర- రాయంచ - రాజహంస, వ్యా- దుంప తూండ్లు - షష్ఠి ॥స॥ అచ్ఛికము-

91. వట్టుచున్=కృశించుచు, అత్యధమవర్తనుడు=మిక్కిలి నీచవర్తనము లవాడు, తనపుణ్యావళంబునన్=తనయొక్క పూర్వపుణ్యామువలన; దొడ్డధన్యుడు=గొప్పకృతార్థుడు; మఱ్ఱివిత్తు=వటబీజము, మును వు=మొందట; శాఖలన్=కొమ్మలచేత: మహోన్నతత్వమును=మిక్కిలి పొడవును, చెందదె=పొందదా; అనగా బొందుచున్నదని యర్థము.

తా॥ మఱ్ఱివిత్తు చిన్నదైనను దానియందుబుట్టిన చెట్టుమిక్కిలి గొప్పదియయి యుండును. అట్లె లోకమున దండ్రిమిక్కిలి హీనుడైనను వానికిగల్గు కుమారుడు తన పుణ్యముచేత దొడ్డవాడగును.

నా- శాఖ - తెగ వ్యా. చెందవె- క్రియ- చెట్టు- కర్త.

92. వలనుగన్=ఉపాయముగా, కానలందుక=అడవులయందు; ప్రతివర్షమునన్=ప్రతిసంవత్సరమునందు, పులి=పెద్దపులి; కనున్=కనును; ఇలన్=భూమియందు, ధేనువు=ఆవు; అటులయినన్=ఆలోచనుచున్నను, తెల్పన్=తెల్పుటకు, కుటుంబములు=వంశములు, అల్పములు=స్వల్పములు, అరయన్=అయినవి, ఆలమందలు=ఆవులయొక్క గుంపులు, కడున్=మిక్కిలి, వృద్ధిన్=అభివృద్ధిని, చెందవె=పొందలేదా.

తా॥ అధర్మబుద్ధితో వర్తించు పులికి సేఁటేట నాలుగైదు పిల్లలు పుట్టుచున్నను దానివంశము వృద్ధికిరాకున్నయది, ధర్మబుద్ధితో బ్రవర్తించు గోవులకు నొక్కొక్కదూడ పుట్టుచున్నను వానిసంతతి పింగుల వృద్ధిచెందుచున్నది. అట్లె యధర్మబుద్ధిగలవాని వంశము నశించును గాని ధర్మబుద్ధిగలవాని వంశము వృద్ధిచెందగలదు.

వ్యు. కానసము - ఉదకమే ప్రాణము గాఁగలది; వ్యా. ధేనువు. మహాంతీవాదశ ములకు, ఈ-వు. లతో నేదియుఁ రాదు గాని ఉకారాన్త శబ్దములకు వు- వర్ణకము మాత్రమె వచ్చును. ప్రతి. దీనిని సంస్కృతములో వ్యాఖ్యానించుదురు.

93. పాపసంగతి=దుర్మార్గులతో సహవాసము. అవశ్యము=ముఖ్యముగా, వలవదు=పనికిరాదు; కొలఁదియెకాక=కొంచెమేకాని, దెుక్కువలు=అధికప్రసంగము లు, కూడవు=పనికిరావు, తమ్ములపాకు లోపలన్=తమలపాకులలో, కలసినసున్నము పూసినసున్నము, ఇంచుకయుగాక=కొంచెమేగాని, మఱింక=ఇంకకొంచెము; ఎక్కువయినచోన్=మిక్కుటమయినయెడల; నలుగడన్=నాలుగుమూలల పొక్కక యున్నె=పొక్కులెత్తకయుండునా.

తా॥ దుర్జన సహవాసము తప్పక విడిచిపెట్టవలయును. ఒకవేళ చేయవలసి వచ్చి నచో దమలపాకులకు దగుమాత్రము సున్నము రాచికొనినచో యుక్తమైనట్లు దుర్జన సహవాసము కొంచెముగా చేయుటయే యుక్తము. అమిత్రసహవాస మధికముగా జేసినచో దమలపాకులకధికముగా సున్నము రాచుటవలన నాలుక నలుగడల బొక్కు లెక్కువట్లు పెక్కులపాయములు సంప్రాప్తమగును.

యు-. సంగతి - సాంగత్యము, తమ్ములపాకు- తమలపాకు, నాలుక- నాలిక, వ్యా. చుఱ్ఱు చుఱ్ఱు మనునది- అనుకరణశబ్దము; పొక్కు-క- అ- వ్య- క్త్వా- కర- భా వార్థకము- పొక్కు-

94. వానికిన్=అమనుష్యునకు, విద్యచేతన్=చదువుచేత, సిరి=లక్ష్మి, అటంచున్=అని, విద్య=చదువును, నేరకాన్=నేర్పుటకు; పూనినన్=ప్రయత్నము చేసిన యెడ; తనపుణ్యము=తనసుకృతము; చాలక=సరిపోనియెడల: భాగ్యరేఖకున్=అదృష్టరేఖకు; పూనగన్=ప్రయత్నించుటకు; ఓపున్=సమర్థుడగును, సరిపో=సరిపోదు గాని అదృష్టహీనుడు=భాగ్యములేనివాడు చెవి=చెవికన్నము; పెంచుటగాక=వర్థింపగలడుకాని; కర్ణభూషణముల్=కర్ణకుండలములను; గడింపగన్=సంపాదించుటకు; ఎట్లోపున్=ఎట్లు సమర్థుడగును-

తా॥ అదృష్టము లేని మానవుడు చెవికన్నము పెంచినం బెంపగలడు కాని కర్ణ కుండలములను సంపాదింపలేడు అట్లే చదువుకొనుటచే నొకరికి సంపద లభ్యింపవని కా

ను బ్రియుల్మించి విద్యాభ్యాసము చేసి విద్యను గణింపగలడుగాని పూర్వపుణ్యము లేకుండ భాగ్యమును సంపాదింపలేదు.

నీతి—ప్రాప్తము లేనిది యేదియు సమకూరదు.

వ్యు- విద్ - తెలిసికొనునది. ప్ర. వి. విద్య. విద్దె.

వ్యా. ఓపున్ - క్రియ. వాడు - సర్వనామము మహద్వాచకము. ఏకవచనము

95. సంతత=ఎల్లప్పుడు; పుణ్య=సుకృతముచే; లాతిన్=ఒప్పుచున్నవానిని; ఒకజాడను=ఒకమార్గమున; సంపద=భాగ్యము; పోక=తొలగక; పెట్టికొని=తోడ్కొని; వసించియుండును=నివాసముచేసియుండును; అన్నికళలున్నయు; పెడబాసిపోయినన్=విడిచి వెళ్లినప్పటికి; తిరుగంబడి=తిరిగి; దేహము=శరీరము; నిండక=పూర్తియగునట్లు, వహింపడోటు=పొందడా అనగా బొందునని యర్థము.

తా॥ అమవసనాడు చంద్రుని కళలన్నియు విడిచిపోయినను తాను బ్రతిదినము దేవతలకు దనకళలర్పించుట వలన గలిగిన పుణ్యముంబట్టి తిరిగి తన బింబము నిండ గళల దాల్చుచున్నట్లు ఎల్లప్పుడు పుణ్యములొనర్చువానినొక విధమున సంపద విడిచిపోయినను అతడొనరించు పుణ్యముచే దిరిగి యీసంపదల బొందగలడు

వ్యా. చంద్రుడు - కర్తృపదము. ఓటు; నోటు; ప్రశ్నార్థకములు - మూసాంతము - ఉప్తిత.

96. సకల=సమస్తమయిన; జన=జనులయొక్క; ప్రియత్వము=ప్రేమ సంపాదించుకొనియుండుట. నిజంబుగన్=నిశ్చయముగా; కల్గిన=ఉన్నట్టి ఒక్కరుడన్ ఒకానొకసమయమందు; ఆపద=కష్టము. తడవు=చాలాకాలము; వేగమే త్వరగానే పాసిపోవుగా=వదలివెళ్లునుగదా; అకలుష=నిర్మలమయిన; మూర్తియైన=ఆకారము కలవాడైన; అమృతాంశుడు=చల్లనికిరణములుగల చంద్రుడు; మ్రింగినన్=మ్రింగివేయగా; టకటక=తొందరను; మాని=వదలిపెట్టి; దృఢస్థితిన్=దృఢమయినయునికితో ఎప్పటియట్ల=పూర్వమువలెనే.

తా॥ నిష్కళంకుడైన చంద్రుడు తాను రాహువుచే మ్రింగబడి కాంతిలేనివాడైనను తిరిగి కొద్దికాలములోనే తన యెప్పటికాంతిని బొందుచున్నాడు. అట్లే సర్వజనులకు బ్రియుడైయుండిన పుణ్యాత్మునకొకప్పుడు కష్టములు వచ్చియుండుటచే

సుఖహీనుఁడైనను వాఁడుత్తరక్షణముననే వాఁడా యాపదను విడిచి యెప్పటియట్ల సుఖమును బొందును.

వ్యు. అమృతాంశుఁడు=చల్లని కిరణములు గలవాఁడు, రాహువు—సూర్యచంద్రులను మ్రింగి విడుచువాఁడు. రూ. రావు—రాహువు, తన్ను - తనను. వ్యా. పాపి పాయుధా. క్త్వా॥ క॥ ఉండఁడె - క్రియ అమృతాంశుఁడు - కర్త.

97. సన్నుతకార్యదక్షుఁడు; సన్నుత=కొనియాడఁబడుచున్న, కార్య=పనియందు; దక్షుఁడు=సమర్థుఁడైన మానవుఁడు, ఒకచోటన్=ఒకపట్టున, నిజప్రభ=తన కాంతి అప్రకాశము-ఐ=స్పష్టము కానిదియయ్యు, లోకులకున్=జనులకు, ఒండొకమేలు=యుక్తయుపకారము, ఒనరించున్=చేయుచుండును; సత్త్వసంపన్నుఁడు=బలముతోఁ గూడియున్న, భీముఁడు=కుంతికుమారుఁడైన భీముఁడు, ఏకచక్రమందు=ఏకచక్రమను నగ్రహారమునందు, ఎన్నిక గాన్=ప్రసిద్ధిగా; బకాసురుని=బకుఁడనే రాక్షసుని; పేర్పునన్=పరాక్రమముచే; అడఁగించి=రూపనాశనము చేసి; అగ్రజాతప్రాణములు=బ్రాహ్మణుల ప్రాణములను, కావఁడె=రక్షింపలేదా.

తా॥ పూర్వము భీముఁడు దానేకచక్రమునందు బ్రాహ్మణవేషము వేసికొని బిచ్చమెత్తుచు నున్నప్పటికి నాయూరివారికందఱికి శత్రువగు బకాసురుని జంపి బ్రాహ్మణుల ప్రాణముల రక్షించినాఁడు. అట్లే లోకమున గార్యదక్షుఁడగు మానవుఁడొకప్పుడు తాన ప్రకాశుఁడైయున్నను లోకుల కుపకారమునే చేయుచుండును.

వ్యు. ద్విజాలు=రెండుపర్యాయములు పుట్టినవారు. నానా. ద్విజదంతముగ్రుష్ఠు.

98. సరస=సుందరమయిన, గుణ=గుణములతోఁ; ప్రపూర్ణునకున్=నిండినవానికి, సన్నపుదుర్గుణము=చిన్నచెడ్డగుణము, ఒరసినన్=సంభవించినయెడ, ఇట్లు=ఈప్రకారము; మానసేర్చుగదా=వదలిపెట్టుమగదా; బురద=అడుసు; ఒకించుకంత=కొంచెము; తమున్=తేమను; పొందినవేళన్=కలసిన సమయమున; జిల్లవిత్తు=ఇండుపుగాయ గంధము, ఒరసినన్=తాకినచో; నిర్మలత్వమునన్=శుభ్రత్వముచే, ఉండదే=తేరిస్వచ్ఛముగా నుండదా.

తా॥ నీరములొకప్పుడు బురదగలవైనను ఇండుపుగాయగంధమంటులో గలిపిన

జలకలుషత్వమును జూచి నిర్మలములగును. అట్లే మంచిగుణములు గలవానికొక దుర్గుణమున్నచో నది తగదని యెవ్వరయిన జెప్పినచో దానిని విడిచిపెట్టును.

వ్యా. ఉండవె - ఉండుధాతువు. వ్య. ప్ర. బ. నీరములు కర్త. సన్నపుదుర్గుణము కర్మధారయసమాసము.

99. సరసదయాగుణంబు, సరస = రసయుక్తమయిన దయాగుణంబు = కరుణ యనెడుగుణము, గలవాని = కలిగినవాని. మహిన్ = భూమియందు; కడున్, = మిక్కిలి, నొచ్చియుండియున్ = నలిగియున్నప్పటికిని; దళముగన్ = విస్తారముగా, లోకులు = జనులు; ఆసపడి = ఆశించుకొని, దాయన్, కదా, వత్తురు = దగ్గఱకువచ్చుచుందురు. చెఱకురసంబు = చెఱకుగడయొక్క రసము, పిప్పిలిపోయినన్ = జారిపోగా, మీదట = అటుతరువాత, పిప్పి ఐ = రసములేనిదై, ధరన్ = భూమిమీద, పడియున్నన్ = పడినప్పటికిని; ముదంబునన్ = సంతోషముతో; చేరవె = చేరుచుండదా.

తా॥ చెఱకుగడయొక్క రసమంతయు గానుగవలన దీయబడిన పిమ్మట నాపిప్పియొద్దచీమలు సంతసముతో జేరుచున్నవి, అట్లే దాత ధనహీనుడై యున్నప్పటికిని లోకులు వానియొద్దకే పోవుచుందురు.

వ్యా. చేరదె - క్రియ - చేరుధా - చీమలు. కర్త. ధరన్ - మహతీవాచకము. సప్తమీవిభక్తి.

100 సార = బలమయిన; విద్యల = జ్ఞానముకల; వర్తనలన్ = ప్రవర్తనలచేత, సన్నుతికి = ప్రసిద్ధికి; ఎక్కినవారితోపలన్ = ఎక్కినజనులలోపల; చేరినయంతనె = కూడిన మాత్రముననె; మూఢులకు = బుద్ధిహీనులకు; నడ = వారియొక్క నడత; చేపడదు = అలవాటు పడదు; కాసారములోనన్ = చెరువులో; హంసములసంగతిన్ = హంసల సాంగత్యముతో; తలపోయన్ = విచారించగా; ఏతీరునన్ = ఏప్రకారముగా; తదీయగతుల్; తదీయ = ఆహంససంబంధమయిన; గతుల్ = గమనములు; కల్గనేర్చున్ = సంభవించును.

తా॥ తామర కొలకులలో హంసములతో గలసి యెల్లప్పుడు తిరుగుచున్నను నాయంచల గమనము కొంగకెట్టును గలగనేరదు, అట్లే లోకములో మంచివర్తనలచే వాసికెక్కిన మానవులతో నెంతకాలము కలిసియున్నను వారియొక్క మంచిప్రవర్త

ని సంపదగలవానికి మేలుచేయుటకున నేమియును లాభమును లేదతేఁడు.

నా. నెఱ(రె) బంధము, ఆకారము, న్యాయము; వ్యా. ఓక. సంభావ్యార్థక విశేషణము, యీపద్యములో కలదు అనునది క్రియాపదము తెచ్చుకోవలెను. (ఏమి ప్రయోజనము కలదు)

103. సిరి=భాగ్యము, వత్తునేరి=కావలెనన్నయెడల, సింహగుహచెంతన్, సింహ= సింహ=సింహము యొక్క, గుహచెంతన్=గుహాసమీపమున, వసించినన్=నివసించిన యెడల, కాలున్=కాలును, కరులన్=ఏనుగులను, వధించగాన్=చంపగా, అచట=ఏనుగులు చంపినప్రదేశమందు, సంచయంబు=ఏనుగుల దంతములసమూహము ముత్యముల్=ఏనుగు తలయందలి ముత్యములున్ను. కల్గున్=సంభవించును, వాయువుగన్=బాగుగా; నక్కబొక్కకడన్=నక్కయున్నట్టి బొరియసమీపమున, ఆశ్రయమందినన్=ఆశ్రయించినయెడల, గొరిసెలు=గిట్టలును, ఎమ్ములు=వానియెముకలు, తోకలు=తోకలు, ఏమిగల్గెడున్=ఏమిలభించెను.

తా॥ ఐశ్వర్యము గోరునట్టివారు ఏనుగుల సంహరించుటవలన రాలిపడియున్న దంతములు, ముత్యములుగలిగిన సింహము యొక్క గుహచెంతను బోవలయును గాని యెముకలు మొదలగు నీచవస్తువులతో నిండియున్న నక్కబొక్కదగ్గఱ నాశ్రయించిన నేమిలాభము.

నా. దంతము = కొండనదుము; పొదరిల్లు, రూ. ఎమ్ము-ఎముక; వ్యా. గుహాచెంతన్, అక్రమసమాసము; నక్క, సంస్కృతమున దీనిని జంబుకమందురు కొమ్ము దీనికి సంస్కృతపదమందురు.

104. స్థిరతన్=మిక్కిలి దృఢమయిన; ధర్మవర్తనన్=ధర్మప్రవర్తనచేత; ప్రసిద్ధికెక్కినవానికిన్=ప్రసిద్ధి పొందినవానికి; ఒక్కముక్కరుడు=ఒకకఠినుడు; అతి నీచవాక్యములన్=మిక్కిలి తక్కువమాటలను; కాదని=తిరస్కరించి; పల్కినన్ పోట్లాడినప్పటికి; అమ్మహాత్ముడు=ఆగొప్పవాడు అయ్యెడన్=ఆసమయమున, కోపము వహింపడు=కోపమును పొందడు; కాకి=కాకము; అమృతరస=తక్కినతానట్టియు పూర్ణ=సంపూర్ణమయిన; సుధాకరమోహనిలోన్=పాలసముద్రమందు; రెట్ట=శ్వానిము లను; ఇడినందునన్=వేసినదానిమున, ఏమికొఱంత=సముద్రమున కేమిలోపము

గాని యట్టిభోజనము లేనిచో మిగుల గృశించుచుండును. తిండిలేనప్పుడు అగ్నిదేవుడే కాంతిదప్పుచున్నప్పుడు మనుష్యుల మాటజెప్పనేల? అనికిమతిన్యాయమునవలన విపయమగుచున్నవి, కనుక నర్థాపత్తి.

అగ్నియనగా పైకిలేచునది అనియర్థము.

వ్యా. ఉండడే - క్రియ-ఉండుధా. వ్య. ప్రి. ఏ. కర్త. అగ్నిహోతుప్రకు.

107. వాశిన్=ఆశక్తితో; నిజపుబుద్ధి=తనకు స్వయముగా బుట్టినపెద్దబుద్ధి; తిరము=దృఢము; పెట్టుబుద్ధులు=ఒకరు చెప్పినబుద్ధులు, అవేళకున్=అసమయమునకు, వెన్కకున్=తరువాతి సమయమును, నిల్వవు=నిల్చియుండవు, హేమకాంతి=బంగారువన్నె; ఎన్నాళులకున్=ఎన్నిదినములకైనను; పదంపడి=మిక్కిలి, ఇనుపతాటకున్=ఇనుపరేకునకు, చాయలు=కాంతులు, పోక=మాయక తాకుకయుండునె=నిలిచియుండునా.

తా॥ స్వతస్సిద్ధముగా బుట్టిన బుద్ధి హేమకాంతివలెను స్థిరముగా నుండునుగాని పరులుచెప్పుటవలన గలిగిన బుద్ధి సానబట్టిన యినుపరేకు తళుకులవలె నాదినము మాత్రమే యుండినశించును,

నా. హాళి (దే) ఆనందము - పరిహాసము. ప్రి. చాయ. వ్యా. పదపడి - పడుమొదలయిన - శబ్దములు పరమైనపుడు ము వర్ణమునకు లోపముగాని పూర్ణబిందువుగాని వికల్పముగావచ్చును. పోక - పోవు ధా, అవ్య - కవ క్త్వా - భా పోయి అనియుండును.

108. హీనకులంబునందు=తక్కువజాతియందు, జనించిన వారికిన్=పుట్టినమనుష్యులకు; సద్గుణంబులు=మంచిగుణములు; ఒకనేరము=ఒకతప్పు; చెందకపోదు=. ఉండకపోదు, పద్మముల్=కమలములు; భూనుతిన్=భూజనపొగడ్తను; కాంచియున్=పొందియు; బురదన్=అడుసునందు; సుధాకర=చంద్రుని యొక్క; ప్రియంబునన్=అపేక్షతో; ఒందవె=పొందుబలేదా

తా॥ పద్మములు లోకమున మిగుల ప్రసిద్ధికెక్కినప్పటికిని బురదయందుబుట్టుటవలన గలిగిన దోషముచేతనే చంద్రోదయ సమయమందు యిష్టముతో జూచుచుండుముగాని ప్రియముతో జూడవు; అట్లై నీచకులమందుపుట్టిన మానవుడెన్ని సద్గుణ

ణములు కలవాడైనను ఒక నీచగుణమును గూడ దప్పక కలిగియుండును.

నీతి. తక్కువకులమందు బుట్టినవానికి దుర్గుణముండితీరును.

వ్యు- పద్మము=దీనియందు లక్ష్మినివసించును. నా నా. కులము- సమూహము పద్మము = పద్మమను పేరుగలది; కుబేరుని నవనిధులలో నొకటి.

109. ఇంచుక = కొంచెము; విహీనతన్ = హీనత్వమును; చెందిన నాకవిత్వ మున్ = పొందిన నాకవిత్వము, నీకతనన్ (నీకు అంకితము చేయుటను) కారణముచేత; మిక్కిలి = ఎక్కువగా; మించువహించెన్ = ప్రకాశించెను; తోలుబొమ్మలన్ = రంగు వేసిన తోలుబొమ్మలను; వాని తెరమాటునన్ = వాటిని తెరచాటున; ప్రశస్తరీతిన్ = మంచిపద్ధతిగా; ఆడించినన్ = ఆడించినయెడల, ఆడవెఱ్ఱియుండుట లేదా; జనుల డెందము = మనుష్యులయొక్క మనస్సును; ప్రీతిన్ = సంతోషముతో.

తా॥ నేర్పరియగు మానవుడు తెరచాటుననుండి నేర్పులగునట్లుగా; దోలుబొమ్మలనాడించుచుండనవి యాడుచు జనులకమితానందమును గలిగించుచున్నది. అట్లె ఓసూర్యుడా నాపద్యముల చివరను జేర్పబడిన నీపేరువలన నాకవిత్వము రసవంతము కానిదైనను మానవులయొక్క డెందమున కానందము గూర్పకపోదు.

నీతి. కవిత్వము యెంతరసహీనమైనదయినను భగవంతుని విషయముగానున్నచో రసవంతమైనదగును.

భాస్కరశతక టిప్పణము.

సంపూర్ణము.



# భాస్కరశతకమున కొన్ని పద్యములయందున్న పదముల సంఖ్యాసూచకములను తెల్పుపట్టిక.

| పద్యములలోని శబ్దములు. | ముఖ్యముగా ఆయాపద్యములయందు బాలురు చూతురుగాక | |
|---|---|---|
| | | **(3) సంఖ్యకలవి.** |
| పాకములు, | మూడువిధములు | నారికేళము, కదళీ, ద్రాక్ష. |
| అవస్థలు. | ,, ,, | జాగ్రతావస్థ, స్వప్న, సుషుప్త్యవస్థలు. |
| కాలము. | ,, ,, | భూత భవిష్య ద్వర్తమానములు. |
| ఏనుగుజాతి | ,, ,, | భద్రము; మందము; మృగము. |
| | | **(4) సంఖ్యకలవి.** |
| బుద్ధి. | నాలుగువిధములు. | మనస్సు; బుద్ధి, చిత్తము; అహంకారము. |
| | | **(5) సంఖ్యగలవి.** |
| పాండవులు. | అయిదుగురు. | ధర్మరాజు. భీముడు; అర్జునుడు, నకులుడు, సహదేవుడు. |
| యజ్ఞము. | ,, ,, | దేవయజ్ఞము; పితృయజ్ఞము; భూత; బ్రహ్మ, మనుష్య యజ్ఞములు. |
| వాయువు: | ,, ,, | ప్రాణము, అపానము, వ్యానము, ఉదానము, సమానము. |
| వర్ణము. | ,, ,, | తెలుపు; నలుపు; పసుపు, ఎఱుపు, ఆకుపచ్చ. |
| అగ్ని. | ,, ,, | గార్హపత్యాగ్ని, దక్షిణాగ్ని; ఆహవనీయాగ్ని; ధాన్యాగ్ని; పాకాగ్నులు. |
| | | **(7) సంఖ్యకలవి.** |
| సముద్రములు. | యేడువిధములు. | లవణ సముద్రము; చెఱకు సముద్రము, కల్లు సముద్రము, నేతిసముద్రము, పాలసముద్రము పెరుగు, మంచినీరుసముద్రము. |
| మేఘము. | ,, ,, | సంవర్తము; ఆవర్తము, పుష్కలావర్తము; ద్రోణము; కాళమేఘము, నీలమేఘము. |
| ఋషులు. | ,, ,, | అత్రి; కశ్యపుడు; భరద్వాజ; విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, వసిష్ఠఋషులు. |



# భాస్కర శతకము.

## పురాణాంశములు

2 పూర్వము రాజరాజనరేంద్రుడను నొకరాజు గలడు. అతనికి రత్నాంగియను భార్యయును సారంగధరుడను కుమారుడును గలరు. ఆరాజు తన కుమారుడు యుక్తవయస్కుడగుట చూచి పెండ్లిచేయ నెంచి రాకన్నియల చిత్రపటముల దెప్పించెను. వానిలో మిగుల నందముగల చిత్రాంగియను కన్యక చిత్తరువునుజూచి మోహించి యామెను తానె పరిణయము చేసికొనెను. కాని చిత్రాంగి సారంగధరు నుండి తన మనస్సును త్రిప్పుకొనలేక యాతనిగలియ జూచుచుండనొకనాడు రాజులేని సమయమున సారంగధరుడు తన పినతల్లి మేడపై వ్రాలిన దన పావురమును దెచ్చుకొనుటకై యామెమేడకు బోవగని చిత్రాంగి సంతసించి డాయబోయి యాతని చేయిపట్టుకొని తన యభీష్టము నెరవేర్పుమనెను. యాతడందుల కిష్టపడక తన బసకుపోయెను తనకోర్కె విఫలమగుటచే నెంతయు వంతజెంది చిత్రాంగి సారంగధరునిపైని లేనినేరములను గల్పించి రాజుతో జెప్పి యాతని కాలుసేతుల నఱకించెను.

3. కుచేలుడను నొకముని బలరామకృష్ణులతో గలిసి కాశీపురమున సాందీపునియొద్దనధ్యయనము చేసినవాడు. ఇతని కిరువదియే

డుగురు కుమారులుగలరు. ఇతడు మిగుల బీదతనముచే బాధపడుచు ధనాశచే దనకు జిన్ననాటి స్నేహితుండయిన కృష్ణునియొద్దకు బోయి యతండు గొనిపోయిన యటుకులనీయగా నతండతని యభిప్రాయమును గనిపెట్టి యాయటుకుల బుచ్చుకొని వాని కధికైశ్వర్యముల నిచ్చెను.

10. హిరణ్యకశిపుడు కశ్యపునివలన నదితియందు జనించినవాడు. ఇతడు విష్ణువుతో బరమశత్రుత్వమును వహించినవాడు వీనికి ప్రహ్లాదుడను కుమారుడు గలడు. అతడు సదాహరిని భజించుచుండువాడు తన శత్రువగు హరిని సేవించుచుండుటచే కుమారుని మిగుల నిరోధించి హరిని స్మరించుట విడువవలయునని బోధించెను. గాని యాతడట్లు చేయనందున కుమారుని జంపింప ననేకములగు నుపాయములు పన్నెను. గాని ఫలించినవికావు. అంతనొకనాడు తానె స్వయముగ కుమారుని జంప నుంకించియుండగా హరి నరశింహాకృతిదాల్చి వానిని సంహరించెను.

13. దశరథుని కుమారుడగు శ్రీరామమూర్తి తండ్రియొక్క ఆజ్ఞచేత పట్టణమును వదలినవాడై నారబట్టలు కట్టుకొని అరణ్యమునకువెళ్లి కాయలాకులు తినుచు పదునాలుగు సంవత్సరము లరణ్యవాసము చేసెను.

17. దేవతలును రక్కసులును సముద్రమును భాండముగాను వాసుకియను సర్పరాజును రజ్జువుగను మందరపర్వతమును కవ్వముగను జేసి యమృతమునిమిత్తము మథించుచుండిరి. అంత నమృతము జనింపక ముందుమిగుల శ్రేష్ఠములగు వస్తువులందు బుట్టినవి.

వానితో లక్ష్మీదేవిని కౌస్తుభమాణిక్యమును విష్ణువు పరిగ్రహించెను.

26. పాండవు లజ్ఞాతవాసవత్సరము వెళ్లించుటకయి నొరు లెరుగకుండగ మారువేషంబులతో విరాటుని సేవించుచుండిరి. అంతదుర్యోధనుడు పాండవులు విరటునొద్ద నున్నట్లు తెలిసికొని తాను విరటుని గోవుల నపహరించి పాండవులను బయట బెట్టి పూర్వము చేసికొన్న ప్రతిజ్ఞ ప్రకారము తిరిగి యడవి కంపవలెనని నిశ్చయించి ప్రబల సైన్యములతో బోయి విరటునిగోగణములు దనపురికి మరలించెను. అర్జునుడు గడువుదినములు ముగియుటను గనిపెట్టి యొక్కడేపోయి కౌరవవీరుల జయించి గోగణములను దోలుకొని పోయి విరటున కొప్పగించెను.

27. శ్రీరాముడు రావణుని జంపబోయి సేతువుం గట్టుచుండ విభీషణుడన్నయగు రావణునియొద్దకుబోయి సీతను రామున కర్పింపుమని హితముగా బోధించి వానిచేనవమానపడి రాముని నాశ్రయించి రావణానంతరము లంకకు పట్టాభిషిక్తుడాయెను.

33. పరీక్షిత్తు అభిమన్యున కుత్తరయందు బుట్టినవాడు. ఇతడు ధర్మరాజాదుల తరువాత కురుదేశముల పాలించెను. ఒకనాడితడడవికి వేటకుబోయి తిరిగివచ్చుచు మార్గమధ్యమున దపము జేయునొక ముని మెడలో నాసమీపమున చచ్చిపడియున్న పామును బడవైచెను పిమ్మట గొంతవడి కాముని యొక్క కుమారుడువచ్చి యది కనిపెట్టి యీతుంటరిపని చేసినవాడు పాముచేత నవశ్యము చచ్చుగాకయని శపించెను. అందులకు బరీక్షిత్తు భయపడి సముద్రములో నొక మేడకట్టించుకొని జాగ్రత్తతో నుసలుచుండెను. వానియొక దినము

నొక బ్రాహ్మణు డిచ్చిన పండును వాసనచూడగ నదియె పామయి వానిని గఱచి చంపెను.

26. శూద్రకుడనురాజు కాశిలో జచ్చుటకు నిశ్చయించుకొని కాశీవాసుడై కాళ్లున్నచో మఱియొక్కడికైన బోవనిచ్చుబోడము నేమోయని మోకాలి చిప్పల నూడదీసికొని యుండెను. అంతనా యూరి యధిపతి యొకగుఱ్ఱమును గొనెను. గాని దానిస్వారిచేయుట కెవ్వడు సమర్థుడు కాకుండెను. అదిచూచి రాజాగుఱ్ఱము నధిరోహించిన వానికి గొప్పబహుమానము చేసెదనని చెప్ప నది విని శూద్రకుడశ్వపరీక్షయం దధికుడు గాన తన్నుగొనిపోయి యాగుఱ్ఱముపయి గూర్చుండబెట్టినచో నాగుఱ్ఱము నధిరోహించి వత్తునని చెప్ప వారట్లు చేసిరి. అంతనాగుఱ్ఱము వానిగొనిపోయి యొకమఱ్ఱిని బెట్టికొట్టగా నక్కడనే ప్రాణములు విడచెను.

38. దేవకియొక్క యెనిమిదవగర్భము 'నిన్నుజంపును' అనునాకాశవాణిపలుకు నాలించి కంసుడు దేవకీవసుదేవుల జెరసాలలో నుంచెను. ఇట్లుండగా నేడుగురు పుట్టిరి. తరువాత నెనిమిదవవాడగు కృష్ణుడు పుట్టినప్పుడు ఆశిశువును కంసుడెక్కడ వచ్చిచంపునో యనుభీతిచే వసుదేవుడా గాడిదకాళ్లుపట్టుకొని యార్వవలదని బ్రతిమాలుకొనెను.

40. సూర్యవంశపురాజగు త్రిశంకుని కుమారు డాడినమాట తప్పనివాడగుటచే సత్యహరిశ్చంద్రుడని పిలువబడెను. ఇతని రాజధాని అయోధ్యాపురము. ఇతనికి చంద్రమతి యను భార్యయందు లోహితాస్యుడను కుమారుడు కలడు. సత్యహరిశ్చంద్రుడు విశ్వామిత్రు

నికి వాగ్దత్తముచేసిన ధనమునీయలేక నోవుటచే నాఋణము తీరుని మిత్త్రము కాశీపురంబున వీరబాహుండను నొక మాలవాని కమ్మబడి వాని సేవించెను పిమ్మట గొద్ది కాలములోనె తన రాజ్యమును బొందెను.

43. హాలాహాలము. ఇదియొక విషపదార్థము. దేవదానవు లమృతమునకాసించి పాలసముద్రమును మథింపగా ముందుగానిది జనించినది. ఇదిమిగుల భయంకరమై లోకముల గాల్చుచుండ దేవతల ప్రార్థనవలన నీశ్వరుడు తనగళమందు నిలిపి లోకములబాధ తొలగించెను.

44. జూదమునాటి పరతులప్రకారము అరణ్యాజ్ఞాతవాసము లు పూర్తిచేసికొని వచ్చినపిదప కౌరవులు యుద్ధసన్నద్ధులగుచుండగా గృష్ణుడు ధర్మరాజునొద్దనుండి రాయబారియై చని సంధిచేసికొమ్మని మంచిగ జెప్పుచుండ కర్ణాదుల దురాలోచనంబులని దుర్యోధనుడు పాండవు లీ కృష్ణుని నమ్మియే యింతగంచుమీరియున్నవారు. ఇప్పుడు నిస్సహాయుండగు నీతనిబట్టిచెరసాలలో బెట్టినచో వారిని గెలుచుట సుకరము. అను నిట్టి యసందర్భములు పేలుచున్న సమయమున గృష్ణుడు తన విశ్వరూపమును జూపించి యచ్చటనుండి పాండవుల యొద్దకువచ్చెను, కృష్ణుడు చెప్పినమాటలాలింపక యుద్ధముచేసి పుత్రమిత్రాదులతో దుర్యోధనుడు మడిసెను.

48. శేషుడు. ఇతడు నాగులలో నాగేశ్వరుడు ఇతడు కద్రువ యందు గశ్యపునకు గలిగినవాడు, ఇతడు మిగుల మంచిగుణములు గలవాడు. ఇతని తల్లియు సోదరులును సవతితల్లియగు వినతను మో

నప్పుడు బూనుకొనగా నీతడంగీకరింపక దుష్టులగు జననీ సోదరులను విడిచి నారాయణునిగూర్చి ఘోరమగు తపస్సుచేసి యతనిదయకు బాత్రుడై యతని యనుమతి ప్రకారము భూమిని వహింపబోయెను.

57. పూర్వము ధృతరాష్ట్రుని ఆజ్ఞ ప్రకారము ధర్మరాజాదులు కుంతీదేవియు కాశిలో క్రొత్తగా కట్టించిన లక్క-యింటిలోని వాసముచేసిరి లక్క-యింటిలోనుండగ దానిని కాల్చుటకు దుర్యోధనుడు కొందరిని నియమించెను. విదురున కీ సంగతి తెలిసి పాండవులకు చెప్పించగా ఒక అర్ధరాత్రియందు ఆయిల్లును తగలబెట్టనున్న దుష్టులున్ను ఆయింటిలోనే నిద్రించుచుండ భీముడు జననిసోదరులను భుజముమీద యెక్కించుకున్నవాడై యిల్లుతగలపెట్టి తెల్లవారునరికి ఒకఅరణ్యమును తీసుకొని వెళ్ళెను మేల్కాంచి వారందరు యీ అద్భుతమును కొనియాడిరి అప్పుడువారు బ్రాహ్మణవేషధారులయి ఏకచక్రపురిలో కొన్ని రోజులు నివసించిరి.

62. దక్షప్రజాపతి యొకదినమున తనకుమారితను జూడబోయెను. ఈశ్వరుడు జపగృహములో నుండబట్టి మామగారిని యెదుర్కొని గౌరవింపకపోయె. అందుకు దక్షుడు కోపపడి ఈశ్వరుడుసమాధిలోనున్నాడని తెలుసుకొనక తనను అవమానించినాడని నిందించుచు తాను పిలువవచ్చిన యజ్ఞముకు పిలువకయె వెళ్ళిపోయెను. అందువలన ఈశ్వరుడాయవమానము సహింపక వీరభద్రునిపుట్టించి దక్షునియింటికి పంపగా కోపముతో వెళ్ళిదక్షుయజ్ఞమును ధ్వంసముచేసిదక్షునిచంపెను.

63. పూర్వకాలమున గొల్లలందరు ఇంద్రయాగము చేయుచుండిరి. ఆయాగముకు కృష్ణుడు విఘ్నముచేయగా దేవేంద్రుడు కోపిం

చినవాడై ఏడహోరాత్రములు గోపాలకులను కష్టపెట్టుటకు రాళ్ల వానకురిపించెను. అప్పుడు కృష్ణుడు ఒకపర్వతమును గొడుగువలె పట్టినవాడై దానిక్రింద సమస్తమైన గోపాలకులను వుంచి వారిప్రాణముల కాపాడెను.

69. శిశుపాలుడు చేదిదేశమును పాలించురాజు. ఇతనికి దంతవక్త్రుడను తమ్ముడుగలడు. వీరెప్పుడు కృష్ణుని నిందించుచుండువారు ధర్మరాజు రాజసూయము చేయుచు సమస్తరాజులను బిలిచెను. శిశుపాల దంతవక్త్రులున్నూ వచ్చిరి. యాగాంతము నీధర్మరాజు భీష్ముడు మున్నగువారి అనజ్ఞనుపొంది మొదట కృష్ణునిపూజించెను. అది చూచి శిశుపాలదంతవక్త్రులు ఓర్వలేక జారుడనియు దొంగయనియు నూటితిట్లకంటె యెక్కువ క్షణములో తిట్టిరి నూరుతప్పులకంటెయెక్కువచేసినాడుగనుక కృష్ణుడుసహింపక తత్కాలముననే శిశుపాలుని శిరస్సు తనచక్రముచే దునిమెను.

73. బలరామ కృష్ణులు నిర్యాణము పొందినపిమ్మట వారల భార్యలను గాపాడుటకు నర్జునుడుమాత్రముండెను. ఇట్లుండ నొకనాడు మ్లేచ్ఛులు కృష్ణునిపైనున్న కోపమును పురస్కరించుకొని యతనిభార్యలను బలత్కారమున దీసికొనిపోవుచుండిరి. అప్పుడర్జునుడు వారలతో యుద్ధమునకు నభిముఖుడాయెను. కానివారల గెలువలేకపోయెను అంతవారలు కృష్ణభార్యలలో చక్కండ్రి దీసికొనిపోయిరి.

76. ద్వాపరయుగమున నారదమహాముని ధృతరాష్ట్రుని యిల్లాలగు గాంధారిని చూచుటకువెళ్ళి చూచి పతివ్రతయనియు అదృష్టవంతురాలనియు అనేకవిధముల స్తోత్రము చేసెను. మహామునీ!

నిక్కమే కాని నాకుమారులు దుర్మార్గులు పాండవులవలన నాపుత్రులకు హానికలుగునని భయపడుచున్నాను. అట్టి విచారము పోగొట్టుకొనుటకు ఉపాయమున్నదో చెప్పుమనెను. ఓగాంధారీ! గజ గౌరీ వ్రతము కలదు. ఆవ్రతమును చేసినయెడ నీకోరికలు సఫలమగును. ఇందుకు నిదర్శనమై ఒకకథనువినుము. పూర్వము శచీదేవి ఐరావతము నెక్కి కైలాసపర్వతమునకు వెళ్ళెను. అప్పుడు పార్వతి శచీదేవిని చూచి యీమె తెల్లనియేనుగునెక్కి వచ్చినది యిట్టియేనుగు నాకు లేకపోయెనేయని విచారించుచుండెను. అదిగ్రహించి ఈశ్వరుడు గణేశ్వరుని తనప్రభావముచే ఏనుగుగాచేసి పార్వతిని యెక్కించగా పదునాలుగు సంవత్సరములా యేనుగునెక్కి సంతోషముతో తిరిగెను. అది మొదలుకొని దేవతలందరు మట్టియేనుగునుచేసి గౌరీ విగ్రహమును వుంచి పదునాలుగు సంవత్సరములు వ్రతముచేసి తమ మనోరథములను పొందుచున్నారు. నీవా వ్రతమునుచేసిన నీకోరికలు నెరవేరునని నారదుడు చెప్పగా గాంధారి తనపుత్రులచే మన్ను తెప్పించి ఆవ్రతమును చేయ ప్రయత్నించుచుండ కుంతీదేవిచూచి విచారించుచుండెను ధర్మరాజాదులు తల్లినిచూచి విచారించుటకు కారణమేమనిరి. గాంధారి చేయబోవు వ్రతమును నేనుచేయుదుననియు మన్ను లేదని విచారించుచున్నాననియు కుంతి చెప్పెను. అప్పుడర్జునుడు అమ్మా! నీవు విచారింపవద్దు నీకు మన్నుయెందుకు ఐరావతమునే తెచ్చియిచ్చెదనని ఇంద్రలోకమునకు వెళ్ళి అప్పుడె ఐరావతమును తెచ్చి తల్లి కిచ్చి ఆమె వ్రతమును నెరవేర్చెను.

81. ధర్మరాజు పరీక్షన్మహారాజుకు పట్టాభిషేకముచేసి తన

తమ్ములతోను భార్యతోనుగూడి వనమునకు వెళ్ళుచుండెను. కొంత నరకు వెళ్లగా ద్రౌపది తరువాత సహదేవుడు పిమ్మట నకులుడు అనంతరమున అర్జునుడు తదుపరి భీముడు ప్రాణములవిడచిరి. ధర్మరాజు వెంటనున్న కుక్కమాత్రము ఆయినతో కూడాయుండెను. భార్యాసోదరులువిగతప్రాణులైనందుకు ధర్మరాజావంతయు దుఃఖింపక మరికొంత దూరము వెళ్లునప్పటికి దేవలోక విమానము తెచ్చి ధర్మరాజునందు కూర్చుండకోరిరి. ధర్మరాజు తనతో వచ్చుచున్న కుక్కను ముందు నెక్కించి తరువాత తానెక్కి స్వర్గమునకుపోయెను.

82. పాండవులును కౌరవులును రాజ్యముకయిపోరాడిరి. ఆ యుద్ధములోను భయపక్షములవారు పెక్కండ్రు నశించిరి, అయినను ప్రస్తుతమున పాండవుల సైన్యమధికముగానుండెను దుర్యోధనునకు కృతవర్మ కృపాచార్యుడు అశ్వత్థామయను ముగ్గురు యోధులు మాత్రముకలరు. అందువలన దుర్యోధనుడు భయపడియా యోధత్రయమును సైన్యము నుసమకూర్పనంపి తానొకతటాకమున జలస్తంభనవిద్య చేదాగియుండెను. అది ధర్మరాజాదులు తెలిసికొని యచటికిబోయి దుర్యోధను నిందింపదొడగిరి. అంతవాడు వారిమాటలసహింపలేక తటాకము వెడలివచ్చి భీమునితో ఘోరముగా బోరిప్రాణములవిడచెను.

83. రాముడు రావణుని జంపుటకు ఘోరమగుయుద్ధముచేసి వానిశిరస్సుం నేలబడునట్లుచేయుచున్నను వానిశిరస్సులుతిరిగి మొలచుచుండెను. అందుచే రాముడుమరింత కోపముతో రావణునిశిరస్సుల దుంచికొండలంత లేసిపోవులుపెట్టుచుండెను గానివాడుచావలేదు. అంతటరాముడుచేయునది లేక చూచుచుండ విభీషణుడు రామునియొద్ద

కువచ్చి రావణుని నాభియం దమృతకలశ మున్నదనియు దానిముందుగ నింకింపనిచో వానితల లక్షలు మొలచుచుండుననియు జెప్పెను. అప్పుడు రాముడాగ్నేయాస్త్రమును వేసికొని ముందుగ నమృతమునింకించి తరువాత సులభముగా వానిని సంహరించెను.

96. రాహువు. వీఁ డొక రాక్షసుఁడు వీనితల్లి సింహిక విష్ణువు మోహినీ దేవియై దేవదానవుల కమృతము పంచిపెట్టుచుండగా వీఁడు కుటిలుడై రాక్షసులలో కూర్చుండక దేవతలతో గూర్చుండెను. అంత సూర్యచంద్రులా సంగతి విష్ణువునకు దెలుపగ నతఁడు తన చక్రముచే వీని శిరస్సు ఖండించెను కాని యమృతసంపర్కముచే దలయు మొండెమును బ్రతికియుండెను యందులో దల రాహువును మొండెము కేతువు నాయెను. వీరు సూర్యచంద్రులు తమకు చేసిన యపకారమును మనమున నిడుకొని వారిని బాధించు చుందురు.

97. బకాసురుఁడు. వీఁ డొక రక్కసుఁడు. వీఁ డేకచక్రపురమునకు సమీపముననున్న యొకగుట్ట మీఁద వసించుచుండెను వీఁ డొక్కమారే యాగ్రామవాసులనందరిని దినుటకు బూనుకొనగా వారందరు ప్రతిదినమొక్కొకని బంపుదుమని వేడుకొనిరి వాఁ డందుల కంగీకరించి యేకచక్రపురవాసులచే నంపబడు మనుష్యుని దినుచు జీవించుచుండెను. ఇట్లు చిరకాలము జరిగిన పిదప నొక బ్రాహ్మణుఁడు పోవలసియుండెను. అతఁ డందులకు విచారించుచుండగా దైవవశమున వచ్చియచ్చట నివసించియున్న కుంతీదేవి యాసుదంత మెఱిఁగి బ్రాహ్మణుని యొద్దకేగి యాతని విచారము బాపి యతనికి మారుగా దన కుమారుఁడగు భీముని బంపెను. అంత నతఁడు మహాబలుఁడుగావున నా బకాసురుని జంపి యా బ్రాహ్మణుని

ప్రాణమె కాకయాయూరివారియందరి యుసురులను గూడదక్కించెను

101 పూర్వముయింద్రద్యుమ్న మహారాజుఅగస్త్యునిశాపము వలన గజేంద్రుడయ్యె. ఆగజేంద్రుడుతన భార్యలతో బయలువెడలి కొలనికి నీరుత్రాగుటకు వెళ్లెను ఆకొలనిలో యున్న మొసలియొకటివచ్చియేనుగుకాలుపట్టుకొనెను కరిమకరంబులు రెండును వేయిసంవత్సరములు పోరాడితుదకుబలహీనుడై గజేంద్రుడుభగవంతుని అనేకవిధములస్తోత్రముచేసెను విష్ణుమూర్తి అటకువచ్చి తనచక్రముతో మొసలినిచంపి గజరాజునురక్షించి వైకుంఠమునకు తీసికొనివెళ్లెను.



